


# మొదటి అంకము

---

## మొదటి రంగము—గృహ.

ఆబాజీ శంభూజీలు.

ఆబా—మామగారూ, మహారాజుగారి కొలువు స్వీకరింపవలెనని మి మ్మెన్నో దినాలనుండి నిర్బంధించుచున్నను ఇంతవరకూ ఏదీ నిశ్చయించుకోలేదు కదా మీరు? ఎంత గడుసువా రండీ!

శంభూ—ఆబాజీగారూ, ఈవిషయమున నేనేదియు నిర్ణయింపలేకున్నాను. వేగిరించి చేసినపని విషమగును కదా? ఆత్రములో కొలువుగొనువారు అతివేగమున దాని వదలుకొందురు. ఇదీకాక, సేవకుని గుణావగుణములు పరికించుట యజమాని కెంతఆవశ్యకమో, యజమానుని గుణాగుణములను పరికించుట సేవకుని క ఆవశ్యము. కాదా? శివాజీ [illegible] గుణములు [illegible] చేతనూ, [illegible] సావధానముగా ప [illegible] [illegible] [illegible] చిన [illegible]

నా కనుభూతములే. వాటిని నామీదనే ప్రయోగించినాడు!
నా మేనల్లుడు—నా సోదరి కుమారుడు—తనతండ్రికి విశ్వాసపాత్రుడనగు ఉద్యోగిని—తన మేనమామను—అట్టి నాపై అకస్మాత్తుగా పడినాడే వాని నైజము నాకు పూర్తిగా అవగతమైనది.... ఇందు విశ్వాసఘాతా, కపటమూ కాక ఇం కేమున్నది? ఇంతకన్న వేరు నిదర్శనము కావలెనా?

ఆబా—ఇట్టి స్వల్పవిషయమును మీరు పెద్దచేయ దగునా?

శంభూ—ఇది మీకు అల్పవిషయ మగునేమో కాని నా కట్లు తట్టుట లేదు. అతని కొకనాటి వెలగాట మయ్యెను కాని, నాకు చిరస్థాయి యగు ప్రాణగొడ్డముగా పరిణమించి నది!

ఆబా—మహారాజుగారు మీవలె దీర్ఘద్వేషులు కారు. ఇట్టి ప్రమేయములను వా రెప్పటికప్పుడే మరచిపోవుదురు.

శంభూ—నాసంగతి వారు మరచిరన్న అదొక వింత కాదు. వారికి మూదినుండుటకు ఇందంత విశేష మేమి కద్దు?... ఇంకొక మాట- అపకారమూ అవమానమును ఒనర్చినవారి నెన్నడును బాధించవు, భరించవలసిన వారి హృదయములకు మాత్రము శల్యము లగును. గొడ్డలివేటుచేత [illegible]ను తెగును కాని గొడవి చెక్క చెదరదే? తానుకొట్టిన దెబ్బను ఊరకబోనక క్షమింప లేరని గొడ్డలిని పట్టును [illegible] మీ మహారాజుగారి మరపు

నకు మఱొక కారణమున్నది. ఎవ్వరైన ఎప్పుడేని పొం
పాటున కపట కృత్యము కావించినచో అది వారి హృద
యమును వేధించును, శివాజీకన్నచో కాపట్యము పరి
పాటు కావున అది వాని మానసమును దూషింపక పోషిం
చును. ఒకనాఁడు బీజాపూరు రాజు కంట దుమ్ముజల్లి వాని
తోరణాకోటను లాగుకొనుట, మఱునాఁడు రాత్రి సాహసముగా
శంభుగాండ్లపై బడి సుపే ప్రాంతము నాక్రమించుకొనుట, మూఁ
డవనాఁడు ఘోరంగోరె సర్దారులను వశపఱచుకొని చాకణకోట
నపహరించుట, నాలవనాఁడు కొండణా మావల్యాయనకు లంచ
ము మేపి ఆదుర్గమును హస్తగతము చేసికొనుట, అయిదవనాఁడు
పురందరుని ప్రభువుల దాయాదుల కలహములను కారణముగా
జేసుకొని, విశ్వాసఘాతకు వెనుదీయక ఆకోటను పట్టుకొ
నుట, ఆఱవనాఁడు కల్యాణిదుర్గపు సుబేదారుని ద్రవ్యాగారము
దోచుకొనుట,—ఇట్టి ఆశగొల్పియో, బెదరించియో స్నే
హము నటించియో తనకార్యమును నిర్వహించుకొనుట తను
మహారాజుగారికి నిత్యకృత్యము లగుచున్నవి. ఇంతేకాదు,
తనజన్మదాతయెడను అన్నదాతయెడను గూడ నిస్సంకోచ
ముగా కుట్రలుపన్నుటకుగూడ జంకఁడు!

ఆహా—మీ రాబాసాహేబు (శివా ) గారికి వా
మగా [illegible]గుటచేతను, వారి కొంటె [illegible] కరకొనసి తెనసి నే
నపేక్షించుచుండుట చేతనూ, [illegible] ను విని తోరణ[illegible]
[illegible] ంచిన [illegible]

త్యావళిచే మహారాజుగారి కెవరును శత్రువులు కాలేదే? వారు వచ్చీలురనుట కింతకన్న వేరు నిదర్శనము కావలెనా?

శంభూ—ఆవిషయమును మీ రెట్లు సిద్ధాంతీకరింప గలరు? వాని కాపట్యాది శక్తుల గూరగించిన నేను వానియెడ వైరభావ మూనకుండుటకు హేతువులు నా మనోదౌర్బల్యము బుద్ధిమాంద్యమూ అని చెప్పదగును, కాని పైవారికి నాకన్న నెక్కుడు చిత్తపటిమ యుండగూడదా? బహిరంగము గా కాకున్న వివి గూఢముగనైన వారు శివాజీని ద్వేషింపరాదా?

ఆబా—అయ్యా, మీరు వారియెడ ప్రతికూలభావ మూని వారికృత్యములను విషమదృష్టితో పరికించుచున్నారు కావున మీయూహలే నిజమని భ్రాంతిపడుచున్నారు. అనుకూలభావమూని సమదృష్టితో వాటిని పరిశీలించినచో మీ యూహ లపోహములని మీకే తోచగలదు.

శంభూ—అమాంతముగా అగ్నిలోపైబడి వారి నుక్కడంచుట అయోగ్యము కాదా?

ఆబా—ఆబాసాహేబుగారు తమశత్రువులను మొదట సామదానములచే సాధింపజూతురు. ప్రభువిశ్వాసనిధాన మగు వారిసైన్యమును వ్యర్థముగా నధించుకొనుట వారి మతము కాదు. ఆ రెండుపాయములును నిష్ఫలములైనచో ఇక వారి కెదివెరవు? సాత్త్వుగా శత్రువులపై బడినయెడల తమపక్షమున రక్షసా [illegible]

శంభూ——ఇరంతయూ తమవీరులయందలి దాక్షిణ్యము చేతనా, లేక పిరికితనము చేతనా? నిసర్గవీరుడు ఎదుట నిల్చి హోరాహోరిగా పోరవలయును గాని దొంగతనముగా పైకొనదగునా?

ఆగా——మహారాజుగారికి పిరికితనము యున్నదనియు దాక్షిణ్యము లేదనియు మీరు నొప్పించితిని. యుద్ధరంగమున సైనికుల నసిగొల్పి తాము దూరమున నుండక వారితో కలిసి పోరాడుచూ, నిహతులైనవారి కుటుంబభరణార్థము వంయు నేర్పాటులు సల్పుచూ, గాయపడినవారికి స్వయముగా చికిత్స చేయుచు-అట్టియెడ జాతిభేదము గాని, కులశీలవైషమ్యములు గాని పాటింపక అందరిని సమదృష్టితో లాలనపాలనముల నొనర్తురు. అయ్యా, ప్రకృతమున కళ్యాణ మహా[illegible] దోపిడిలో మృతులైనవారి కుటుంబములనాదరించుచూ, క్షతులైనవారికి చికిత్స గావించుచున్నారు, చూచెదరండు (పోవుదురు)

---

——: రెండవ రంగము :——

---

(శివాజీ, బాలకృష్ణపంత్, మంచములపై సైనికులు)

శివా——అమ్మలారా, అయ్యలారా, మీ యల్లరిలో మీసుతులు, పతులు, పితలూ తనువుతొరగినారు. వారందరు నాకు తోబుట్టువులని [illegible] చుచున్నాను. మీ మీ

కుటుంబములనుండి ఒక్కొక్క మానవుడు గతించె గాని, నా హితైషులు, నా అంగరక్షకులూ నాతోడి సమభివ్యవహారులూ, నా కొరకు ప్రాణముల నర్పించు నాసఖులు సోదరులునైన నా రణవీరులు నన్నువిడిచి చనినారు. అసిధారాతీర్థంబున మునిగియుటచే మనల దుఃఖసాగరమున ద్రోసి వారు స్వర్గము నలంకరించినారు. ఈ సమరములో కొంత మేలొనగూడక పోలేదు. పుణ్యము చేసుకొనుటచేతనే వారు స్వధర్మము కొరకును స్వరాజ్యముకొరకును తమ ప్రాణముల నర్పించ గలిగిరి. పుట్టినవారెల్ల గిట్టుట నిజమే, ఐనను శత్రుకోటికి తమ అస్త్రశస్త్రముల పదను చవిజూపి తామెట్టి క్లేశపడుచును ప్రాణముల బాసిన ప్రతివీరభయంకరులు ధన్యులు కారే? కావున వారికై మనము వ్యాకులపడరాదు. అట్టిమృత్యువు నా కలవడచేయుమని సర్వేశ్వరుని సదా ప్రార్థించుచున్నాను.

ముసలిది.—పదికాలాలు మీరు బతికుండాలి మా రాజా. పరమేశ్వరా! వీరిని చిరంజీవిని చెయ్యి.

శివా.—అమ్మా, నీబోటికి స్వామిదివసరత్తయమునా? పరమేశ్వరుడు నాకు ప్రసాదించిన ఆయువెల్ల నా దేశకళ్యాణమునకు నా దేశబాంధవుల యోగక్షేమమునకూ ధారపోయవలెనని నా దృఢసంకల్పము. ప్రధానీ, నాకొరకమితానందముతో అసువుల బాసి తమకుటీరములను, తమవారి అంతఃకరణములను పాడొనర్చినవారి కుటుంబముల స్వాస్థ్యములయెడ మనము శ్రద్ధవహింపవలయును. వారికి సంభవించిన ప్రేమ

హాసికి మనము ప్రతివిధానము జరుపనేరము. కావున వారి యోగక్షేమములు సానుకూలరీతి నరయుట మనవిధి; అందెట్టి లోపమూ గానీయగూడదు-కళ్యాణాగ్ర వ్యాపారములను మనకు కరగతము చేయుటలో ప్రాణములు గోల్పోయినవారి కుటుంబములు కాగ్రన్యవిధానముపై హక్కు గలదు.

రెం॥ ముస॥—మేం కూలోళ్ళం, మాకు డబ్బులో చే పని మహారాజా! మీరు సల్లగా ఉంటే మాకేమిలోటు నాకింకా కొడుకులుంటే వాళ్ళనికూడా మీ పాదాలమీద పడేతును.

శివా—వీరమాతకు తగిన మాటలాడితివమ్మా. నీ వంటి తల్లులు మన దేశమున నుండునంత కాలము వీరుల కేమి కొరవ? నీబోటి ఉదారచరితుల ఉదరపోషణార్థము శ్రద్ధవహింపకున్న నేను మీపుత్రులకు ప్రభువుగా నుండతగను.

మూడో ముస॥—మా రాజా, మావోళ్ళు యుద్ధాని కెళ్ళినప్పుడు మమ్మల్ని మీ కప్పగించి "మేం వెళ్ళినా చింత వొద్దూ, మా రాజుగారే మీకు తలిదండ్రులు, వారే మిమ్మల్ని పోషిస్తారు" అని చెప్పారు.

నాల్గు ముస॥—మా రాజా, నా పిల్లలూ మీ పాదాల కాడ పడేస్తున్నా-ఈడయ్యాక మీకొలువు చేస్తాడు.

శివా—తండ్రినిపోలిన తనయుడు బంటుతనమునకు కుదురుకొను. దేశము ముమ్మాటికీ ధన్యము-కుర్రా, నీవు మా కొలువు చేసెదవా?

కుర—ప్రభువుగారు చెప్పడఁవేఁ లోటు-పిరంగినోట్లో దూర్తాను:

శివా—(వాని కౌగిలించి) భళిరే! నీవు వీరపుత్రుడ వే. నిసంటి లేతకబళము ఫిరంగివాత పడవలెనన్న తత్స్వార్వము నా సేనయే కాక నేను కూడా మడియవలయును. అమ్మలారా, మీ రికపొండు. మీ స్వార్థత్యాగమును నా సైనికులూ నేనున్నూ మార్గదర్శకముగా నెంచుకొందుము.

శంభూ—మహారాజుగారికి స్త్రీలయెడ ఆదరము మిక్కుటము. (వారు పోవుదురు)

శివా—ఓహో, మామగారా, ఎప్పుడు విచ్చేసితిరి ?

శంభూ—నీ వాస్త్రీల నోదార్చుచున్నప్పుడు.

శివా—ఓదార్పినంత మాత్రమున ప్రయోజన మేమి? శుష్కప్రియవాక్యములచే హృదయమందలి గాయములు మానునా? అవి మానసములయందలి దుఃఖముల రేపి జాలి నభివృద్ధి నొందించును. సజీవస్నేహమున కనలుచున్న చిత్తములను నిర్జీవ తత్త్వోపదేశ బిందుధారలు చల్లార్చునా? ఆప్తుల వచనముల వినకున్న సుఖము శూన్యమని యెంచుచుండు హృదయములు అతిదీర్ఘములై వెగటుపుట్టించెడు పుక్కిటి పురాణముల విని సంతసించునా? (మంచములమీదివారితో) మిత్రులారా, మీ గాయములు మానుచున్నవా? వీరు కాయములకు గాయము లలంకారములు; సంగ్రామదేవత సాహసికులగు వీరులకు చేతి కడియములు, కాలి గొలుసులు, మెడ

లోని సరులు, చెరి యొకటో, చెరి రెండో బహుమానముగా నొసగుచుండును. గాయపుమచ్చలు ఒడలిపై నెంత దట్టముగా నుండిన సౌందర్య మంత హెచ్చును. గాయములచే సాలంకృతులగు ఇట్టి యోధులు శత్రుసేన అను తెరమరుగున నిల్చియున్న విజయలక్ష్మి పాణిగ్రహణ కుతూహలులై తమ శస్త్రములతో ఆ తెరను చీల్చి ఆమెచే విజయహారములను తమ కంఠమున వేయించుకొందురు. (వారి శరీరముల నిమిరి) మిత్రులారా, ఆ సుఖము లభించుటకై మీరీదుఃఖము ననుభవించవలసియున్నది.

వీరుడు——మహారాజా, మీ చెయ్యి సోకుటచే గాయముల బాధ కొంతవరకూ ఉపశమించినది.

శివా---బాహ్జీ, నీ గాయములే నీ దేశభక్తిని స్వామిభక్తిని నిర్వివాదముగా నిరూపించుచున్నవి. బహిర్జీ, ఈ గాయము నీవు నన్ను శత్రువునుండి కాచునప్పుడు తగిలినది, కావున నీనిగూర్చి నే నెక్కుడుశ్రద్ధ వహింపవలదా?

బహి——విపర్యస్తముగా సెలవిచ్చుచున్నారు ప్రభువువారు. అప్పుడు మీ నాతురకను అంతమొందించుటచేతనే నేను బ్రతికితిని. లేకున్న నాకు మీ దర్శనలాభ మిప్పుడు చేకూరునా? మీరే నన్ను పునర్జీవితుని చేసితిరి-ప్రభూ, మీరు దైవసమానులు, మహారాజా!

శివా——ఈత డెవడు? మోతాద్యామహాన్ వలెనున్నాడు. (తడుమును)

మోత్యా—ప్రభూ, స్ణాలు-నన్నిక్కడికి తెచ్చి నప్పుడు నా కొళ్ళు తెలియదు-నన్ను రచ్చించాల మీకు నాసార్కి సోకింది, నాతల తీసీంది మారాజా!

శివా—నా దేశమును నా ప్రాణమునూ కాపాడుటకు నాదండ నుండి భుజమునకు భుజముచేర్చి శత్రువులతో హోరాహోరిని పోరునప్పుడు స్పర్శదోషము లేదుకాని నీవు గాయముల బాధచే మూల్గుచూ పడియున్నప్పుడు నిన్నంటిన స్పర్శదోషము సోకునా? లేదు, లేదు-మానవు డంతకఠోరహృదయుడూ కృతఘ్నుడును కాలేదు. మోత్యా మనమిరువుర మొక దేవుని బిడ్డలము, నేను రాజభవనమున పుట్టి పెరిగితిని. నీవు కుటీరమున బుట్టి పెరిగితివి; ఇది కేవల దైవయోగము-కాని మానవధర్మశాస్త్రము మనలో గొప్పభేద మేర్పరచినది-నిన్నటి యుద్ధమున నీవు మనకిద్దరికి ప్రభుభృత్యసంబంధమును మీఱిన సౌదర్యమును నికటతరసంబంధమును స్థాపించితివి; నన్నంటబోకుమని ఇప్పుడు నిషేధించితివేని నేనొక హింస్రజంతువునని యెంచినవాడ వగుదువు.

మోత్యా—మావోళ్ళుతప్ప నన్నెవ్వరూ ముట్టుకోరు. మీరు దేవుళ్ళంటోరు గనక నావోళ్ళు నిముకుతున్నారు. మీ దాసుణ్ణి, అడ్డు సెప్పుతానా?

శివా—(ఇంకొకని చూచి) వీడు ఆబాజీ సేవకుడు సట్వాజీ-సట్వా నీ కిందాక గాయ మసలే లేదు, నీవు వీరిలో జేరితి వెట్లు?

సట్వా—దేవరా, తమరు నేను గాయపడినోర్ని సూ స్తారని తెలిశి మిమ్మల్ని ముట్టుకోందావని నేనే గాయం చేసుకొన్నాను.

శివా—గాయమునకు నేను చికిత్సచేసిన చికిత్సకు నీవు గాయము చేసుకొంటివా?......మీరు మాకై పడిన శ్రమ బాపుటను మాచేతనైన సువిధముల చేకూర్చెదము. నేడు మాతృశ్రీ జిజాబాఈగారు తమచేతులతో మీపథ్యపానీయ ములను తయారుచేసి కోడళ్ళచేత వడ్డింపజేయుదురు.

బాజ్జీ—మీచేతి పరిచారమూ మాతృశ్రీగారి చేతి ప్రసాదమూ దొరికిట్టాయినా ఇలాంటిగాయాలు నూరైనా పొందగలము, మారాజా!

శివా—మా బంటులకు సాయం దిట్టిగౌరవ ముం డుట మా భాగ్యము-మే మిక పోదుము. మీ కచిరకాలమున ఆరోగ్యప్రాప్తి యగుగాక!

---

## —మూడవ రంగము—

---

(శివాజీ శంభూజీలు)

శివా—మామగారూ, జాతిని కులమున, బాంధవ్య మునసూ ఎట్టి సంబంధమూ లేని జను లెందరో స్వరాజ్యసం పాదనమున నాకు తోడ్పడుటయు, తమబోటి ఆప్తులు పరా ఙ్ముఖులగుటయూ సౌభాగ్యమని తమకు తోచెనా?

శంభూ.—శివబా, నీ వించుక ఆలోచించితివేని నీకును వీరికి నెంతవైషమ్య మున్నదో మన కిద్దరికీ అంత వైషమ్య మున్నదని గ్రహించగలవు; మన సాధ్యములయందును సాధనములయందునూ ఎంతో వ్యత్యాసమున్నది.

శివా.—స్వరాజ్యస్థాపనము మీకు రుచింపదా?

శంభూ.—అది అందరికీ కావలసినదే కాని శక్యమగునో కాదో ఇంచుక ఆలోచించవలదా? నీ బల మెంత? నీ ప్రతిపక్షుల బల మెంత? అదీకాక ప్రతిపక్షు లొకడైన కొంత మేలు. ఒకదెస దక్షిణాపథమందలి బలాఢ్యులగు అదిల్‌షా కుతుబ్‌షాల తోడనూ, మరొకదెస అమితబలశాలియగు ఔరంగజేబు పాదుషా తోడనూ—రెండు ప్రచండసైన్యములతో నీవు పోరాడ నెంచితివి. ఒక్క మహమ్మదీయబంటునకు నీ మావళీలు నల్గురు చాలుదురా?

శివా.—నా ఆదర్శ మసాధ్యమైనను దానిని సాధించుటలో నా కేమాత్రము యశము చిక్కకున్ననూ నిరుత్సాహుడ కాబోను—నీచాదర్శమును సాధించి యశము పొందుట కన్న ఉచ్చాదర్శమును సాధించుటకై యత్నించి విఫలుడ నగుట శ్రేయము. ఇంతకూ నాఆదర్శము దుస్సాధ్యమైననూ అసాధ్యము కాదని నా నమ్మకము. మహమ్మదీయ తురుష్క సైనికులకన్న మా మావళీలు కృశాంగులనుట తథ్యమే, కాని విలాసప్రియులగు విపక్షులకంటె మావాళ్ళు దార్ఢ్యమున సహనమున నెక్కువవారని మీ రెరుగరా! కృశించిన మా

దేహములు తురకలపై దాడివెడలునప్పు డంతగా పనికిరాకున్ననూ ముట్టడింపబడునప్పుడు చాలాసేపు ఓర్చియుండుటకునూ, శత్రువులనుండి తప్పించుకొనునప్పుడును, వెనుకకు తగ్గునప్పుడునూ, అవి అమూల్యములు కావా? మావారి వెంట కొండలెక్కుట దిగుటయు తురుష్కుల కెంత ప్రాణగొడ్డములు? శరీరదార్ఢ్యము, పుష్టి, దీర్ఘత్వమును మీరు పెద్దజేయుచున్నారు గాని నేను వాటికి మహత్వ మారోపించను; మానసిక పుష్టి, దార్ఢ్యములం కధిక మహత్వ మున్నదని నా నమ్మకము-పురివసిన బాహువులకన్న బిగికల మానసమూ, విస్తీర్ణమగు వక్షముకన్న నిర్భీకమగు చిత్తమునూ నా కధికములు-శాత్రవుల శరీరములు మాశరీరములకంటె నాల్గురెట్లు పెద్దవైనను మా మానసములు వారి మనస్సులకంటె పదిరెట్లు ధైర్యస్థైర్యములు కలవి.

శంభూ—వారి శస్త్రాస్త్రవాహనసంపత్తి సామాన్యమనుకొంటివా? వాడియగు డెమాస్కస్ ఖడ్గములు, తేజోవంతములగు అరబ్బిగుఱ్ఱములు, తోడాతుపాకులు, మత్తమాతంగములు, పొడవుకత్తులూ, ఎత్తైనబల్లెములూ, ఉన్నతములగు నుష్ట్రములూ చక్రాకారముగా నగ్నినుమిసెడు ఫిరంగిగములూ-ఇవన్నియూ అజయ్యములు మొగలసైన్య మహాసముద్రము రసపుత్రసైన్య నదీప్రవాహముల మింగును, దక్షిణమహమ్మదీయసేనాదావాగ్ని మహారాష్ట్రసేనాగ్ని శిఖల గ్రసియించును.

శివా——అయ్యా, ఆ సేనలు కలగూరగంప లనుమాట నొప్పరికింతు రేల. మాభటులకూ వారిభటులకూ సాటియే లేదు. మాతృదేశరక్షణార్థమును, స్వాతంత్ర్యనిర్వహణమునకునూ మడియనున్నవారి యుత్సాహము, బాహుబలమును నమ్మి పరదేశముల నాక్రమింపదలచి విదేశీయుడును విధర్మియు నగు రాజు ననుమతిని విలాసార్థ మద్దెకువచ్చిన బంటుల కుండునా? మరియు దారపుత్రాదుల మానప్రాణముల కాపాడి మాతృభూమి నుద్ధరింపదలచి స్వకీయుల దీవనలను గొనుచూ ప్రాణముల త్యజింపవలెనని సిద్ధపడిన పోటుబంటుల యుత్సాహములో శతాంశమేని, అర్ధమానసము స్వదేశమున నున్న దారాపుత్రాదులమీద, తక్కినది తాము అద్దెకుస్వీకరించిన అనవసరయుద్ధము మీద నిడుకొని, లక్షలకొద్ది ప్రజల తిట్లు తినుచూ ధనాశచే ప్రాణముల వీడనున్నవారి కుండునా! మనోదార్ఢ్యము నిర్భయహృదయమును కల్గియున్న మా మావళాలకు ప్రాపుగా పరమేశ్వరుడు ప్రసాదించిన సువిధముల మీరు పరికింపనేలేదు. ఈ సహ్యాద్రిసానువుల ఔన్నత్యము నవలోకింపుడు. వీటికెవ్వ రెనను ప్రతిఘటించి నిల్వగలరు ఈ కొండకనుమలలో వేలకొలది శత్రుసైన్యములు మాయ మగును. వీటి నాశ్రయించి పోరెడు మా పిడికెడు సైనికులమీద ఫరంగిబంటులు వేలకొలది ఫిరంగిగుండ్లు పేల్చిననూ, వాటి ప్రతిధ్వనిచే వారిచెవులు చిల్లులుపోవుట తప్ప వేరు ప్రయోజన మేముండును. మాసేన లీదుర్గద్వారములనుండి

అగ్నివృష్టి కల్పించెనా? పాదుషాసైన్యములు భస్మము కావా? కావున మా సహ్యాపర్వతము శత్రువుల కసహ్యమే కదా? శత్రురాశికి దుర్నిరీక్ష్యములు దుర్గమములునగు ఈపర్వతశిఖరములకు మాయందు పుత్రవాత్సల్యము కలదు కావుననే మమ్మువి తమరెక్కలపై చిత్తమువచ్చినరీతి నాడించుచూ అన్యులనుండి ఉపద్రవము రానున్నతరి లోలోన నిముడ్చుచుండును. అప్పుడు రహస్యమార్గములయందు మేము సిగబంతి వాడక సంచరించుచుందుము.

శంభూ—ఈ రహస్యముల నెరిగిన మీవారు శత్రువులలో చేరకూడదా?

శివా—మావారి నందరినీ మాపక్షమున నుంచుటకు యత్నించుచున్నాను. అట్లు చేరనివారి నంత మొందింతును.

శంభూ—మహారాష్ట్రసరదారు లెందరు లేరు-వారికన్న నీ యెక్కువ యేమి?

శివా—నామావశేషమైన నిజాంషావారిసత్వము నాకు చెందనున్నది. ప్రతాపము బాయుచున్న ఆతని ప్రభుత్వమును నిలువబెట్టవలయునని నిరపేక్షబుద్ధితో నాతండ్రిగారొనర్చిన భగీరథప్రయత్నము మీ రెరిగి యున్నదే. అందుకే కాదె బిజాపూరుసుల్తానుతో వారు పోరవలసి వచ్చెను. నిజాంషా మాత్రము సామాన్యుడా? విశ్వాసఘాతకుడు-మామగారిని మరదినీ చంపి గద్దెనెక్కినాడు. ఐనను వానికి చిక్కుమూడినప్పుడు మాతండ్రిగారు సాయపడిరి. ఎంతలంచమైన

నిచ్చి లోబరుచుకొనవలయునని మొగలులు యత్నించినను వారికి లొంగలేదు, వారితర్జనభర్జనల పాటిసేయలేదు. నిజాంషావంశమువారికా రాజ్యము చిక్కుట అశక్యమైన పిదప భగ్నమై చెదిరిపోయిన పరిస్థితులలో స్వరాజ్యస్థాపనము సేయబూనిరి కాని బిజాపూరుసైన్యము మొగలులతో చేరినందున కృతకృత్యులు కాకపోయిరి. ఆ వ్రతము సాంతము చేయుట నాకు విధి. పవిత్రమైన నాకార్యమునకు ప్రతికూలురైన మహారాష్ట్రుల బలిమిచేనైన కపటముచేనైన బంధింపక మానను. దేశహితమునకు ప్రాణముల నర్పింప నడుముకట్టిన నేను నాహితము నవరోధించెడివారి ప్రాణముల గొనక మానుదునా?

శంభూ — అభినివేశులకు అంతరాయము లల్పములై తోచును. మొగల మహమ్మదీయుల మతభేదము వారు నీతో పోరునప్పుడడ్డురాదు. మొగలసేనామహాసముద్ర మొకటే మహారాష్ట్రమును ముంచివేయగలదు; లేదా, దక్షిణమహమ్మదీయదావాగ్ని ఒకటే మహారాష్ట్రమును దగ్ధము చేయగలదు. ఈ రెండుసేనల బారినుండి తప్పించుకొనిపోవ నీ మావళాలకు మార్గము లేదు. వెనుక బిజాపూరు మొగలసేన లేకీభవించినప్పు డెట్టి ప్రమాదము వాటిల్లెనో స్వానుభవముచే నెరిగిన శాహాజీమహారాజును జూచియైన నాతనిపుత్రుడవు బుద్ధి తెచ్చుకొనుట యోగ్యము.

శివా — ఆ ప్రమాదము నే నెరుగునది కాదు. కాని రాజనీతినిపుణులకు దానిని తప్పించుకొనుట అసాధ్యము

కాదనినా మతము. ఢిల్లీపాదుషా, బహామనీసుల్తానులునూ ఏకధర్మావలంబకు లైనను రాజ్యవిభాగమున వారికి స్పర్ధలు లేకపోలేదు. అది అదనుగా గొని వారిసైన్యముల నేకీభవింప నీయక వారిలోవారికి పోరుపెట్టుట యుక్తిపరులకుదుష్కరము కాదు. అట్లు జరిగినచో నా కాసైన్యముల సంకలనమును కాక తద్వ్యవకలనము నెదిరింపవలసి వచ్చును. మీరిప్పుడు వర్ణించినరీతిని పాదుషాసైన్యము మహాసముద్రమునూ, దక్షిణసైన్యము దావానలము నైనచో, మొగలసేన మమ్ముముంచి వేయకమున్నా, దక్షిణసేన దగ్ధముచేయకపూర్వమునూ ఆ సైన్యము లొండొంటిని తారసిల్లి అందులో నొకటి హాత మైన కావలయు, లేదా హతమైన కావలయును; అట్టి యేర్పాటుల నే నాలోచించియున్నాను. శేషించిన సైన్యముపనిబట్టుటకు మా మావళాలు చాలుదురని మీ రెరిగియే యుందురు. పాదుషావారి పరికరసంపత్తిని మీరు వర్ణించుట వినినప్పుడు నాకు పరమానంద మాయెను, ఏలయన ఆసంపదంతయు మా వశము కానున్నది. అంతవరకూ వారు దానిని న్యాసమువలె కాపాడుచుందురు. త్రేతాయుగమున వానరసేనచే రాళ్ళతో సేతువుకట్టించి సముద్రము లంఘించినరీతి ప్రకృతమున మా సేనచే స్వరాజ్య స్థాపనము చేయించవలయునని ఈశ్వరసంకల్పమగునట్లు సూచనలు కానవచ్చుచున్నవి.

శంభూ—నీ యోచనలన్నియు కపటోపాయములపై నాధారపడియున్నవి. అర్ధరాత్రమున అమాంత మరులపై

బకుట, కలహములను పెంచుట, విశ్వాసఘాతయొనర్చుటకు తంత్రములు పన్నుట కన్న తురకలవలె సమరభూమిని హాహాకారిగా పోరుట నాబోటి పోటుబంటునకుచితముకాదా? ధర్మయుద్ధ మవశ్యకర్తవ్యము.

శివా—సూాను గారూ, ఆసేతుశీతాచలము తమప్రభుత్వ మనుచ్చుకొనిన తురక లిప్పుడుధర్మయు ద్ధప్రశంస చేయుట వింతకాదు. ఆదిని వీరభ్యసించిన విద్య కపటనీతి కాదా? నాప్రభుత్వమూ ఈశ్వరానుగ్రహముచే వారి ప్రభుత్వముతో సమమైనప్పుడు నేను కూడా ఇట్టిశీరంగనీతులే చెప్పుచూ ధర్మోపన్యాసము లిచ్చెదను...ధర్మయుద్ధ మొన ర్చవలెనన్న ఉభయపక్షములూ సరిసమానముగా నుండవల యును. ఇప్పుడీరువీరుల బలాబలములు మీ కెరుంగనివి కావు. సమరభూమిని సైనికులరక్తము వరదలై పారినను పాదుషావారి కెట్టిహానియూ కలుగనేరదు, వారి సాధనసంపద అమేయము. నా వీరులరక్తము నేనతిమితముగా వ్యయముచే యవలయును, వృథారక్తపాత ముండనేకూడదు. తురక లధి కారసంపన్నులు, మే మధికారహీనులము; వారు కుబేరులు, మేము కుచేలులము; వా రస్త్రకలితులు, మేము నిరస్త్రిల ము; వారిసైన్య మసంఖ్యాకము, మా సైన్యము గుప్పెడు; వారు బాహుబలము నాధారముగా నొనర్చుకొన్నారు, మే ము బుద్ధిబలము నాధారపర్చుకొన్నాము. ప్రతివిషయమున నూ వారికీ మాకునూ వైషమ్య మున్నప్పుడుమేము రాజనీతి

వనుసరింపకధర్మము నాశ్రయింపవలెనని తురక లపేక్షించుట చూడ మల్లయుద్ధమున క్రిందబడినవాడు పైనున్నవాడు తన్నేమియూ చేయగూడదని అపేక్షించుచున ట్లున్నది. యుద్ధమున బాహుబలమూ బుద్ధిబలమునూ ముఖ్యసాధనములు; మాకు బాహుబలము తక్కువగుటచే మేము బుద్ధిబలము నుపయోగింతుము.

శంభూ—నీ కపటకృత్యములకు, విశ్వాసఘాతలకు, హత్యలకును దేవుడునీకెట్టి శిక్ష విధించునో ఇంచుక ఆలోచించితివా?

శివా—స్వదేశోద్ధారణమునకు స్వరాజ్యసంస్థాపనకును నాకావశ్యకములగు కుతంత్రములు, విశ్వాసఘాత, హత్యలను గురించి దైవము నా కెట్టి ఘోరశిక్ష విధించిననూ వలదనను; రౌరవాది నరకములలో నన్నుద్రోయుట యుక్తమని ఆతడెంచిన నేనచట నుండుటకుసంసిద్ధుడనని నమ్ముడు.

శంభూ—శివబా, నా సందేహములన్నియు తీరినవి. నీమార్గమే శ్రేయమను నమ్మకము నాకు కలిగినది.

శివా—ఐనను మీమార్గ మెట్టిదని నాకు స్పష్టముగా లేదు.

శంభూ—మహారాష్ట్రులకందరకూ వంశపారంపర్యము సర్వసాధారణమైన మార్గమే నే నవలంబింతును. మీ తండ్రిగారివలె నీవూ బిజాపూరు వారి ఆశ్రయమున నుండి మీకులకీర్తిని వృద్ధిచేయవలయు,గొప్ప జాగీరులనందవలయు,

ఉత్తమ బిరుదముల నొందవలయు నని ఊహించియుం టిని గాని ఆయభిప్రాయ మిప్పుడు వ్యత్యస్తమయినది.

శివా——నాకు బిరుదములు కావలెనన్న బిజాపూరు సుల్తానువారి అనుగ్రహ మేల? వాటిని నేనే స్వీకరింపగలను- నా పేరునకు ముందు వెన్కల బిరుదుల నేనే తగిలించుకొంటిని, మీరు వినలేదు కాబోలు.

శంభూ——చంద్రారావనియా లేక సూర్యారావనియా?

శివా——అట్టి ఉచ్ఛిష్టముల నేను కొందునా?

శంభూ——అట్లైన కొత్త బిరుదుల కల్పించితివి కాబోలు?

శివా——ఛత్రపతి శివాజీ మహారాజు.

శంభూ——నాయనా, నీ వాపదవి నొందగల్గినందుకు నా కమితానందము కల్గుచున్నది.

శివా——అట్లయిన మా కార్యనిర్వహణమున మీరు నాకు తోడ్పడెదరని నే నెంచవచ్చునా?

శంభూ——నేను తోడ్పడుట నిశ్చయమే గాని నా యందు నీకు నమ్మకము కల్గు టెట్లు?

శివా——మామగారూ, మీ పురాతనమతమును మీరు వీడనున్నప్పుడు మీయందు నా కపనమ్మక ముండుట కూడునా? నావాడని నేనెంచిన వానియందెల్ల నాకు సంపూ ర్ణవిశ్వాస ముండును. అందుకు సంచకరువుగా నేడే మిమ్ము మీ కూతుళ్ళకడకు గొంపోయెదను; మిమ్ము చూడవలయు

వని వారు కౌతూహలము వహించియున్నారు. నాపత్రమును మీరు స్వీకరించిరని విని వారు మిగుల సంతసింతురు.

(పోవుదురు)

---

## —•నాల్గవ రంగము•—

---

(శివాజీ, ఆబాజీ, శంభూజీలు)

శివా—కళ్యాణదుర్గముపై దండెత్తుటనుగూర్చి ఆలోచింపవలసి యున్నందున మిమ్ము పిలువ బంపితిని. అందలి ద్రవ్యాగారమును హరించి యిప్పటికే వారిని నొప్పించినాను, కావున వారు కసిదీర్చుకొను కాలమునకై వేచియుండి తగు ప్రయత్నముల సల్పుచుందురు. ఆ సన్నాహము ముగియకుండగనే దుర్గమును మనము చేత జిక్కించుకొనవలయును.

ఆబా—ఆబాసాహెబుగారూ! నా దొక మనవి—

శివా—ఆబాజీ-మనలో మనవులు చేసుకొనునంత భేదభావ ముండగూడునా? ఏమి కోరదలచిరో కోరరాదా?

ఆబా—విన్నప మొనర్పదలచిన విషయ మించుక మహాత్వాకలితము కాన దాని మీ రంగీకరింపరేమో అని చెప్ప వెరచుచున్నాను.

శివా—అదెట్టిది?

ఆబా—ఆ కోట ముట్టడించుటకు ప్రభువుగారు నా కాజ్ఞ నొసంగవలయునని వేడుచున్నాను.

శివా—ఆ కలహాము నే నారంభించితిని కావున నేనే దాని ముగించుట న్యాయము.

ఆబా—నామాట యాలింపుడు-ఆ దుర్గముతో టి సంబంధము మీకు నేటిది కాని నాకది వంశపరంపరాగతమని మీకు తెలిసియే యుండును. నామాతృవ్వ శివపురము చేరక ముందు కళ్యాణదుర్గము చెంతనున్న మా అగ్రహారమున నుండెను. మాపూర్వుల నాను బేదారులు అజస్రము బాధలు పెట్టుచు తుదకు వారిని ఘోరముగా హత మొనర్చిరి. ఆవివర మంతయు మామాతృవ్వ నాకు చెప్పుచుండుటచే బాల్యమున నే ప్రతీకారవాంఛ నాకు పొడమి, వయసు తోడ వృద్ధిపొం దినది. తమయండ నుండి శత్రువుల రుధిరముతో పితృతర్పణ మొనర్చి ఋణవిముక్తుడను కావలయునని ప్రతీక్షించుచుండి యున్నాను. నాయాశలు ఫలించుటకు నేడు తగినతరుణము తటస్థించుటచే వారిక్రౌర్యమునకు వినియుయముగా హింసకు ప్రతిహింస, హత్యకు ప్రతిహత్య, బలాత్కారమునకు బదులు బలాత్కారము- ఈతీరున లెక్క వారలకు సరిగా ఒప్పగించిన కదా నాజన్మము ధన్యమగును.

శివా—అబాజీ, మీరు పవిత్రమైన బ్రాహ్మణకుల మున జన్మించితిరి. క్షమ, తితీక్ష, విరాగము మొదలగు గుణములు మీకు స్వాభావికములని మీకొక రుపదేశించ వలయునా? హత్య, అత్యాచారములును తురకలొనర్చు నపుడు ఘోరములు నింద్యములందుము కదా, బ్రాహ్మణులు

వాటి నొనర్చునప్పు డవి సౌమ్యములు స్తుత్యము లగునా? మీ పూర్వపురుషుల బాధించిన తురకలు మానవత్వము పరిత్యజించి పశుత్వమును పరిగ్రహించిరి. మీరును వారివలెనే ఆచరించిన ఆపశుత్వము మీకు మాత్రము సిద్ధింపదా? అట్టిచో మీరెవరి కపకారులగుదురు, వారికా, మీకా!— మరియు మీరెప్పు డెట్లు ప్రవర్తింప నెంచితిరో అట్టి ప్రవృత్తినే తురక లవలంబించినందులకు వారిని మీరు నిందించుట కూడునా? వారి పశువృత్తి క్షణికము, మీరు పాతకయ్యముల పెకలించి వారియెడ నత్యాచారము సేయబూనుట పశువృత్తిని మీరిన రాక్షసవృత్తి యగును. తాత చేసిన తప్పినకు మనుమని శిక్షింపనెంచుట దొంగను వీడి దారిబోవు నన్యాసిని ఉరిదీసినట్లుండును. ఇంతేకాక పురుషుల దురాచరణమునకు స్త్రీలపై కసిదీర్చుకొనుట రాక్షసవృత్తిని మీరిన దగుటచే దానికేమి పేరిడ దగునో ఎరుంగజాలము. అట్టి ప్రవృత్తు లతిశయించెనా ఇక దేశమున శాంతి ప్రబలుటెట్లు?

ఆబా— ఘోరశిక్ష విధించినచో శత్రువు భీతిల్లి తిరుగ దురాచారపరుడు కానేరడని మీ రానతీయలేదా?

శివా—అది నిజమే. ఆనిబంధన మాశత్రువునందు వర్తించును, ఆశిక్షయు అపరాధము జరిగినవెంటనే విధింపబడవలయు. ఇందా రెండులక్షణములూ పట్టలేదు. విశ్వాసనీయశూరులగు మామావళాల రక్తపాతము నాకసమ్మతమగురీతిని శత్రుపక్షరక్తస్రావము కూడ నాకసమ్మతమే. అం

దును ముఖ్యముగా అబలలయెడ అతి జాగరూకతతో మెలగ వలయు. పాపము వారెవ్వరికి నపకారము సేయువారు కారు, చేయనేరరు; ఆత్మరక్షణము వారి కసలే చేతగాదు. అట్టి అమాయికల కపచారము సేయబూనుట పౌరుషహీనత కాదా! అట్టి కృత్యము నాకు అసమ్మతము. నా కార్య సిద్ధికి నాపక్షము వారి ఆశీర్వాదబల మెట్లావశ్యకమో శత్రు స్త్రీలఆశీర్వాదబలిమి కూడ అట్లే ఆవశ్యకము.

శంభూ—శివబా, స్త్రీలయెడ నీకు సానుభూతి ఎక్కుడున్నట్లు తోచెడిని.

శివా—ఏల యుండగూడదు? మాతుశ్రీ జిజాబాయి తుకాబాయియు స్త్రీలుకారా? అట్టివారే నకన్యస్త్రీలు. వారియం దాదర ముండకూడదా?

శంభూ—(స్వ) నిజము నిలకడమీఁద గాని తెలియదు.

శివా—ఆబాజీ, కళ్యాణదుర్గము నెడ మీ మనోభావము లిరకను మాఱకుండినచో మి మ్మింటిగా నటబంపుట యుక్తమగునో కాదో ఆలోచింపవలసి యుండును.

ఆబా—మీ యుపదేశానంతరమునా ద్వేషాహంకారముల నణచుకొనలేకున్న ఇంతకాలము మీతో సహవాసము చేసిన ప్రయోజనమేమి?

శంభూ—ఇంతయేల! నీ వనుమతించితివేని ఆబాజీతో కూడ నేనుండి వాని యుద్రేకము నడచుచుందును.

శివా—ఇది మేలు. అట్లే చేయుదుము. మిమ్ముచూడ గోరు మీకోడళ్ళ నిరువుర నొక్కచో కూర్చెద, మీరు నావెనువెంట మహాలునకు రండు. (శివాజీ పోవును)

శంభూ—ఆబాజీ-చిన్ననాటనుండియు మనమున రగులుచున్న ద్వేషాగ్నిని నివారించుట దుస్సాధ్యము. ముక్కవగల కోర్కెను మట్టిబెట్టుదురా?

ఆబా—సత్యమే-కాని ఆకోర్కె నిర్వహించుటకు పరిస్థితులు ప్రతికూలము లయినచో ఏమి సేయసగును? పోనీ ఆతురకల నర్హరీతిని దండించు సుయోగము లభింపకున్నను వారికోట నాక్రమించుటవలన చేకూరు యశము మాత్రము సామాన్యమా?

శంభూ—ఆబాజీ! మీనిర్యాతనము నిర్వహించుటలో మాతృము మీకు లోటురానేల?

ఆబా—ఆబాసాహేబు సౌశీల్యము అనువర్తనీయము.

శంభూ—ఆదేటిమాట? ఆతని శీల మింతదనుక పరిశుద్ధము కానచ్చును. కాని దానియందు కళంకబీజ ముండక పోదు. అది యంకురించుట కింతవఱకు అవకాశము చిక్క లేదు. ఇంతకూ అతనిప్రాయ మెంత? పరిజ్ఞాన మెంత? నారీలోకమున తనభార్య లిరువురే అని అభిప్రాయబడుచున్నాడు-వారికన్న వేయిరెట్లందకత్తియలు వేసవేలున్నారని యెరుగడు. వారి విలాసములయెడ నాతని కింకనూ విసుగు జనింపలేదు. వాని భార్యల యందము వాని యౌవనముచే నాపో

పింపబడినదే కాని నిసర్గనిష్పితము కాదు. తారుణ్యప్రభావమున తరుణులందరూ దర్శనీయులై యుందురు. ఇదియునుగాక మనరాజుగారు మోటుమహారాష్ట్రము గాక ఇతరదేశము నకు పోనేలేదు. తురకల హర్మ్యములలోని అప్సరలబోలు అందకత్తెల సౌరు వారికంటబడనేలేదు. ఒక్కసారివారినివీక్షించి కామశరాహతులైనచో ఏరెట్లు చిందులుద్రొక్కుదురో మీరే చూడగలరు.

ఆబా—మహారాజుగారికి తమరాజ్యముయందమితప్రేమ కలదని మీరు వినలేదా?

శంభూ—ఇరువురు స్త్రీలయెడ మితమోహమట! ఆబాజీ! మిమ్ముజూడ నాకునవ్వువచ్చుచున్నది. పురుషులప్రేమ ఏకనిష్ఠమగునంతవఱకే దాని నమ్మవచ్చును. అందు భాగ హారిణులమరినచో అటుపిమ్మట నాప్రేమ వెఱ్ఱికుక్కవలె చూచినవారినెల్ల కఱవజొచ్చును. కన్యలనియు నవోఢలనీ విచక్షణము దానికుండదు

ఆబా—ఇతరులవిషయమున నిట్లు జరుగవచ్చును. కాని శివాజీయెడల నిది వర్తించునని నేను నమ్మను.

శంభూ—ఆతడును మానవుడే కదా? నేటి సంభాషణ యందు స్త్రీప్రశంస వచ్చినప్పుడెల్ల ఆతడు మెత్తబడుచుం డుట మీరు గాంచలేదా?

ఆబా—అట్లనెదరేల? వారి స్త్రీదాక్షిణ్యము ఇతర సద్గుణములవలె అపూర్వము.

శంభూ—స్త్రీదాక్షిణ్యమా? ఇట్టి స్త్రీదాక్షిణ్యమే స్త్రీలోలత్వమునకు బీజము.

ఆబా—ఊరకుండుడు. మీపలుకు లెవరేని వినినచో కిట్టనిమాట లందురు.

శంభూ—ఏమి టీ లేనిపోని ఊహ! మీకు హితము చేయగోరియే ఇట్లనుచుంటిని. నే నీప్రమేయములో తలదూర్చుట మీ కుపకారము చేయుటకే కాని వేరుకాదు. ఇటు చూడుడు-ఏమి ఈ శివబాబుద్ధిమాంద్యము! శత్రువుల నిర్జించు నడ దౌర్జన్యము,జోరావరియు కూడదని సాధువులగుమీబోటి బ్రాహ్మణులెంచుట సహజము కాని జిగీషువగు క్షత్రియున కది తగునా? సద్బ్రాహ్మణులగు మీరు దురాగతములచే దుష్టుల దండింపనెంచుటయు, క్షత్రియుడగు శివాజీ సాధుత్వము నవలంబించుటయు వ్యత్యస్తధర్మములు కావా? శత్రురాజ్యములయందు నిరంకుశముగా చెలరేగనీయకున్న దేశముల జయింప నుత్సాహము కల్గుచుట్టులు? కొందఱు బంట్లు లూటీ నపేక్షించి పోరాడుదురు, మరికొందర వండకత్తెల నాశింతురు. బంగారు, రత్నములు మొదలగు ద్రవ్యముల కొందర పేక్షింప బంగారు బొమ్మల నితరు లపేక్షింతురు. ఇందేదియూ వారికి లభింపనిచో వారు ప్రాణములచేత బట్టుకొన ఆయితపడుదురా?

ఆబా—లూటిలో దొరికిన ద్రవ్యాభరణముల తమ ముం దిడవలయునని మహారాజుగారు శాసించియున్నారు.

శంభూ—చూచితిరా; కనకముపట్ల సైనికుల విశృంఖలవృత్తి నొప్పుకొనిరన్నమాటయే కదా? దీనిచే సైనికుల కెట్టినష్టము ఘటిల్లినను రాజునకు లాభముండును......కనకమునుగూర్చి చేసిన ఏర్పాటుకాంతలపట్లకూర్చుట కాటంకమేమున్నది? అందలి సామ్య మాతనికి తెలియకపోవుటయే దీనికి హేతువు. శత్రుశిబిరమున జిక్కిన సౌందర్యవతులనెల్ల మహారాజుగారి సమ్మోల సమర్పణము చేయవలెనని శాసించుట ఎంతయు సమంజసము. ఇట్టి శాసనము పుట్టుటకుజగన్మోహినియగు కాంత వాసికంట పడవలయు. అట్టి సౌకర్య మీదండయాత్రలో చేకూరిన నెంతయు శ్రేయమగును.

ఆబా—చేకురకేమి? కళ్యాణసుబేదారు కోడలట్టి రూపవతియే అని విందుము.

శంభూ—మరియు మేలే-పసకేలోయిన తీగ కాలికి తగినట్లైనది. ఆకాంతను భద్రముగా తెచ్చి శివబాకు కన్పరచుదము.

ఆబా—అయ్యొ బాబో! ఆబాసాహెబునాజ్ఞ నుల్లంఘింతునా? కలలోనైన నట్లు చేయజాలను.

శంభూ—ఇం దాజ్ఞోల్లంఘన మేది? మీరామెను బలాత్కరింపరు కదా. అమూల్యమగు స్త్రీరత్నము నా బాకీకి కానుకగా నిత్తురు. రిక్తహస్తములతో రాజును దర్శింపగూడదని శాస్త్రమున్నది కదా? కానుకలలోననేకవిధము లున్నవి. బ్రాహ్మణులు కొబ్బరిచిప్ప కధిపతులు కావున కొబ్బరికాయ

నర్పింతును. నాపాలుకారి ధనవంతుడు కావున రత్నాంబరముల నర్పించును. విజయశ్రీచే వరింపబడిన వీరుడు తన బాహుబలముచే గడించిన కాంతామణిని కానుకగా నొసంగుట యోగ్యము.

ఆబా—నా కృత్యముల సరిచేయుటకు మి మ్మాబా సాహెబు నాకు తోడుగ బంపుచున్నారు కావున నేను మీ మాటల పాటిచేసినచో అపరాధిని కాజాలను.

శంభూ—ఆచింత మీ కణుమాత్రమును వలదు. దానికి నేను పూచీపడెదను. మీరింక పొండు- నేను రాణుల చూడబోయెదను (అబాజీ పోవును)........ఏమి శివాజీ దుండగము! స్వరాజ్య సంపాదనమున తనకు సాయముచేయని మహారాష్ట్ర వీరుల కంటకములవలె వీడు పెరికి పారవేయునా? మంచిది-ఛత్రపతీ! మహారాజా! నీవే నన్ను నిర్మూలింతువో, లేక నేనే నిన్ను నిర్మూలింతునో చూచెదవుగాక! నీయధికారము నణగద్రొక్కక ఈ శంభూజీ ఊరకుండువాడు కాడు. నీప్రశస్తి బాహుబలప్రతిష్ఠితము కాదు, కాపట్యమున కార్యమును సాధించుటయే పరమపురుషార్థమని నీ వెంచుచుంటివి. నీకు ద్రవ్యపరాఙ్ముఖత్వము లేనేలేదు. పరులద్రవ్యము నపహరించుపట్ల నీ వెంతనీచముకేని ఒడిగట్టుటకు జంకవు. నీస్వహితపరాఙ్ముఖత్వమును స్త్రీదాక్షిణ్యమునూ చూచి ముగ్ధులై అనాగరకులగు మహారాష్ట్రులు నీకు లోబడుటచే వారిబలము నాధారము చేసుకొని నీ వాడుచున్నావు. నీ

భటులు తమ సర్వస్వమును నీకు ధారపోసి రణమందు ప్రాణములను కూడ నీయశోవహ్ని కాహుతి చేయుచున్నారు. శాత్రవుల స్త్రీలయెడ నీనిర్మలమైన ప్రవర్తనము చూచి నిన్నందరూ గౌరవింతురు. నీవు పరస్త్రీపరాఙ్ముఖుడవుకావని పదిమందీ ఎరిగినచో నీయశోదీపము సన్నగిల్లును. అంతదనుక నే నప్రమత్తుడనై యుండెద. నీవు ఉన్నతపదవినుండి నన్ను దిగలాగినచందాన నిన్ను నేను క్రిందకీడ్చెదను. నన్ను నీవు పదభ్రష్టుని చేసినందుకు మాఱుగ నిన్ను నేను నీతిభ్రష్టునిగ జేయకున్న నా యసమానాగ్ని చల్లారదు.........

(నిష్క్రమించును.)

---

—ఐదవ రంగము—

---

(ఇద్దఱు రాణులు, అమాత్యుడు—కాశియవాడ్ తురకవర్తకులు, ఇద్ద రింగీషువర్తకులు కూర్చుండ శివాజీ ప్రవేశించును)

శివా—అమాత్యవర్యా, నేడు మీరు చాలసందడిలో నున్నారు-బట్టలబేరమున మునిగియున్నారు కాబోలు-మొన్న మాకు చిక్కిన ధనమునంతయు నిద్దరురాణులూ నేడే వ్రయపరుప నెంచలేదుకదా?

అమా—మహారాజుగారి ఆంతర్యము ననుసరించియే పతీబాయి గారు బేరమాడుచున్నారు.

శివా—అదెట్లు?

అమా—మన సైనికులలో గతించినవారిగూర్చియు గాయపడినవారిని గూర్చియు ఏర్పాటులు ప్రభువుగారే కావించియున్నారు. మొన్నటి యుద్ధమున అసమానశౌర్య సాహసముల నగపరచినవారిని బహూకరించుట మిగిలియున్నది కావున అందుకుతగిన ఏర్పాటులు చేయ మహారాణిగా రంగీకరించియున్నారు.

శివా—భళీ రే! ఈమె నాయర్ధాంగి యనదగును. ఏమేమి కొన్నారు?

సఖి—తలపాగాలు, రుమాళ్ళు, దుప్పట్లు, ఉత్తరీయములు నే నెంచుచుంటిని, సోయరా శాలువలూ, పీతాంబరములూ, చీరెలూ ఏర్చుచున్నది.

శివా—చిన్నరాణిగారు చూపిన పరాక్రమ మేమి పారితోషికమునకా—?

సోయ—పురుషులు చూపు పరాక్రమము కేవలము వారి కృపాణములయందే ఆధారపడియుండు నని లోకులందురు గాని వారిసతుల మంగళసూత్రమహత్వమే అందుకు ముఖ్య కారణమని నానమ్మకము.

శివా—సత్యమే-శత్రువు లీవిషయము నెరుంగరు కావున ముందు మీకంఠము లుత్తరింపక మా మెడలు నరుకుచున్నారు...నీ మతమున మా డాలులు మమ్ము కాచుట లేదన్న మాటయే.

సోయ—సతుల మంగళసూత్రమహిమ నడలకున్న

మి మ్మన్యవిధముల గాచుట అనవసరము.

శివా—అటులనా? మీ కుంకుమ యను డాలు న్నదని మాకెన్నడును తోచలేదు. మీరిరువురును నాపితరుల ప్రసాదమని నేను గ్రహించియుంటిని. అది నేడు సార్థకమయ్యె. పెద్దరాణిగారు మా అమ్మగారి ప్రసాదము కావున వారియందు లజ్జావినయాంశ మధికము; చిన్నరాణిగారు మా తండ్రిగారి ప్రసాదము కావున వారియందు తేజపాలు హెచ్చు...మీరుభయులు నెంచిన వస్త్రముల జూపుడు.

(శంభూజీ వచ్చును.)

దయచేయుడు మామగారూ, మీ కొమార్తెల వివేక తారతమ్యముల కనులార గాంచుడు. ఈ ముదుగువస్త్రములు మీ పెద్దకూతురికి నచ్చినవి, ఈసన్నని బట్టలు మీ చిన్నకూతు రెంచినవి. (ఒక మడత విప్పి) ఈవస్త్రములు కులీనురాలికి పనికిరావు. ఇట్టి వస్త్రములు నందలకొలది యిచ్చియు శ్రీకృష్ణుడు ద్రౌపదీమానసంరక్షణ మొనర్ప జాలడు. దీని ధరించిన విలాసవతి యొడలే కాక అంతరంగమును స్పష్టముగా గాంచనగును. ఇది గాలికన్న పలచనై పారదర్శక మగుచున్నది.

సోయ—ఇట్టి వస్త్రములను భర్తల దృష్టిసౌఖ్యమునకు భార్యలు ధరింపనగును.

శివా—సరిసరి. ఇది కంటె కగపడినకదా దృష్టిసౌఖ్యమబ్బుట! దీనిని ధరింపకయే ధరించితి ననవచ్చును-ఇట్టి

వస్త్రము మాకు కాపట్టము. శెట్టిగారూ, దీనిని మూటలో కట్టుము-మా కీముతక వస్త్రములే తగియున్నవి. మోటు మావళాల రాణిగారికి మోటు వస్త్రమే శోభాకరము. ఈ జిలుగు వస్త్రములు ఢిల్లీ బీజాపూరు సుల్తానుల జనానా వారికే తగియున్నవి. సుఖవాసులు, భోగపరులగు వారిచెంత నివి వత్సరములకొద్ది మనగలవు. కోమలగాత్రులు వారెంతవాడిన నవి చిరుగునను భయము వారికుండదు. మా మోటు శరీర ముల రాపిడికవి నిలువజాలవు. వస్త్రములకూ వాక్యములకును వృత్తిపై పరీక్ష యుండును. కొద్దివారి వాక్యములు వారిభావ ముల వ్యక్తపరచుచుండ, వారి వస్త్రములు వారిశరీరములను మరుగుపరుచుచుండును; గొప్పవారి వాక్యములు వారి భావ ములను మరుగుపరుచుచుండ, వారి వస్త్రములు వారిశరీరముల వ్యక్తపరుచుచుండును.

సోయ—సఈబాయి నాకన్న ఈడుముదిరినది. కావున ఈముతక వస్త్రము లామెకే శోభాకరముగా నుండును.

శివా—వయసున పెద్దవారికి వివేకము హెచ్చగునా? పూర్వకర్మపరిపాకము వెంటవచ్చినచో వయసున బాలుడయ్యు బుద్ధిని వృద్ధుడగును, అది లేకున్నచో వయసున వృద్ధుడయ్యు బుద్ధిని బాలుడగును.

సోయ—సూక్ష్మ విషయములలో మహారాజుగారి కర్హమైన సలహా నిచ్చుటయందు దీదాసి అసమర్థురాలైనను, వారు నిరుత్సాహమనస్కులగునప్పుడు మనోరంజన మొనర్ప

కలు సాఫల్య్ మలవడిన దీనిజన్మము ధన్యతమ మనియే భావించుచును.

శివా——ప్రేయసీ, చిన్నబుచ్చుకొనుట కిందవకాశమే లేదు. నా సంసారనిర్వాహణమునకు మీరుభయులూ ఉండ తగినవారే. అమాత్యవర్యా,...ఇతరవర్తకుల యొద్ద పుచ్చు కొనదగు వస్తువులున్న వాటిని తీయించుడు.

కా॥ వర్త——మహాప్రభూ! నావద్ద కొంత పాతసరుకు కలదు. మీవాగ్ధోరణిబట్టి చూడ నవి యిక్కడ చెల్లునని ఆశ వొడముచున్నది. ఆనతిచ్చినచో వాటిని చూపెదను.

సోమ——పాతసరుకు మాకేల?

సఈ——కొన్నిసందర్భములందు కొత్తదానికన్న పాత సరుకే ప్రశస్తమగును. ఔషధముల సేవించునప్పుడు కొత్త కుప్పె కొత్తతేనె కన్న పాతకుప్పె పాత తేనె శ్రేష్ఠతరములు కావా?

శివా——ప్రేయసీ, మేలైన మాటాడితివి. సువస్తువు లకు కొత్త పాత అను భేద మనావశ్యకము. శారీరకవ్యాధుల పారద్రోలుటకు పాతదినుసెట్లుపయోగించునో అటులే మాన సికవ్యాధుల పోగొట్టుటకు ప్రాచీనసాహిత్య ముపయోగిం చును. కాలుమహిమను పాత ఔషధములు సాగనివ్వనట్లు కాలమహిమను పాతగ్రంథములు సాగనీయవు.

కా॥ వ——(ఉత్తరీయమునుదీసి) దీనిని చిత్తగింపుడు. ఇది విజయనగర సంస్థానాధీశ్వరులు అనేకతరములు వాడు

కొనితి. ఆరాజ్యము కూలిపోయినప్పుడు ఇతర ఆశ్రితులతో పాటు ఇదియు అన్యుల నాశ్రయించినది. నేను గొప్పవెల నిచ్చి దీని సంగ్రహించితిని. దీని నేత ఎంత ప్రశంసనీయమో గాంచుడు.

శివా—(దానిని చేత బూని) ఈవస్త్రము ప్రాచీన మనుటకు సందియము లేదు. దీని పలుచని నేతగుండా విజయ నగరేతిహాసము నాకు స్పష్టముగా గోచరించుచున్నది కళ లకు, విద్యలకునూ పుట్టిల్లు, దిగ్విజయశీలురగు రాజులకూ వేదవిద్యాపారంగతులగు మంత్రులకూ ఉనికిపట్టు, బాహు బలమునకూ బుద్ధిబలమునకును విలాసక్షేత్రము! కటకటా! అట్టిప్రబలము, విస్తీర్ణము నగుసామ్రాజ్యవైభవమున మిగిలిన యున్న దీవస్త్ర మొకటియేనా,?... “కాలాయ తస్మైనమః” అమాత్యవర్యా! ఈవస్త్రము నొకచోట నుంచుడు (ఇచ్చును)

కా॥ వ—ఈ రెండవ వస్త్రము మొదటిదానికన్న విలువ మీరునదని యెంచనగును. (చూపి) ఇది అహమ్మదు నగరురాణి చాంద్‌బీబీ గారి “చంద్రకళ” అని పేరువడసిన చీరె. దీని ధరించినప్పు డాయమ జలధరాచ్ఛాదితంబగు చంద్రు లీల గానవచ్చుచుండెనని చెప్పుకొందురు. ఆపట్టణపు లూటీలో నిది యొకసైనికునికి చిక్కెను. నేను దానిని కొని తెచ్చితిని.

శివా—ఏ రాజ్యము క్షీణదశ నొందుచున్నప్పుడు మాతండ్రిగారు తమ యావచ్ఛక్తియు దానిని నిలువబెట్టుటలో నుపయోగించిరో, అట్టిరాజ్యమును తనశౌర్యబలిమిని బుద్ధి

బలముచేతను కాపాడిన పుణ్యవతిని గౌరవింపనివా రుందురా? సోయరాౣ, నీ వింకవస్త్రముల కొనవలసియున్నది కావున దీని పుచ్చుకొనుము.

సోయ—తురకదానివస్త్రమునా?

శివా—అయ్యో, వెత్తిదానా-మహాత్ములకు కుల ముతో నేమిపని? గనులలో నుండి రత్నములు వెలువడలేదా? మిన్నున నవి మనకు లభించునా? మహానుభావుల సహవాస ముచే నెట్టిఫల మబ్బునో అట్టిఫలమే వారివస్తువుల సహవా సముచే నబ్బును. అమాత్యా! దీనినిగూడ మీాదగ్గర నుంచుము.

కా-వర్త—మహాప్రభూ! ఈ శిరోవేష్టనమును తిల కింపుడు. ఇది చిత్తూరుప్రభువులగు ప్రతాపసింహ మహారాణా వారిది.

శివా—అది మీాకెట్లు లభించెను?

కా-వర్త—ఆమహాత్మునకొకయిక్కట్టు వచ్చి వారు దీని నొకవర్తకునకు విక్రయించిరి. ఆవర్తకునకు దానిమహిమ తెలియకుండుటచే మాతండ్రి దానిని కొన్నాడు.

శివా—ఈవస్త్రము లిదివర కమ్ముడుబడక మీావద్ద నుండుటకు కతమేమి?

కా-వర్త—ఇది అచ్చిరాదని చూచినవారెల్ల పెదవి విరిచి మోము త్రిప్పుచుండెడివారు దేవరా!

శివా—ఆహా! లోకు లెంత అజ్ఞానులు! రసపుత్ర

వీరకేసరియగు మహారాణా ప్రతాపసింహుని భవ్యశిరము నలంకరించినవస్త్రము, కలలోనైన పారతంత్ర్యవిచారమునకు చోటీయని శిరస్సు నాచ్ఛాదించిన వస్త్రము, శత్రువునకు లొంగియుండని వీరశిఖామణి వస్త్రము, శత్రువుల అడుగులకు మడుగులెత్తు వీరమ్మన్యుల కచ్చివచ్చునా? ఏ పురుషోత్తముని పేరు తలపువచ్చినంతనే పిఱికిపందల యుల్లమునందైన వీరావేశము జనించి ఆచంద్రార్కమంతరించకుండునో అట్టి మహాత్ముని వస్త్ర మచ్చిగాదా? నే నీశిరోవేష్టనమును పూజ్యభావముతో నాచెంత నుంచుకొందును. సంకటములకు నేను లోనగునప్పుడు ఈవస్త్రము నామానసమున నుత్సాహచైతన్య ముదయింప జేయును... సెట్టిగారూ - మీమాటలు సత్యమని యెంచి ఈవస్త్రముల నేను కొనుచున్నాను. అమాత్యవర్యా-వీరికి వీటివెల నిచ్చివేయుడు. వీరెవరు, వీరి వర్ణము, నగ్నశిరస్సులును జూడ ఐరోపీయులవలె నున్నారు.

అమా—వీరి నాంగ్లేయులందురు.

శివా—వీరి దేశాభిమానము తీవ్రమైనది. వీరు మంచిశూరులు, చతురులగు నావికులు, మద్యపానము వీరి కాచారము. ద్రవ్యలోభము వీరికి మెండు; ద్రవ్యమే వీరికి దైవము- వీరి స్త్రీదాక్షిణ్యము కూడ ప్రశంసనీయము. వీరిస్త్రీలు పురుషులతో సరి సమానముగా వ్యవహింతురు. వారికి స్వాతంత్ర్యము మెండు.

సఈ—పురుషులందరితో స్త్రీలు కలిసిమెలిసి వర్తిం

చుట సిగ్గులేమి కాదా?

శివా—అట్లన రాదదు. వ్యక్తులనీతిని తత్తత్సమాజ ములందు రూఢిచెందిన నీతి నియమముల బట్టి నిర్ణయించుట యుక్తము. తురకలకన్న మాస్త్రీలకు స్వాతంత్ర్య మెక్కు డగుటచే వారు మనవారిని స్వైరిణులనుట ఎట్లుతగదో అట్లే మనముకూడ ఆంగ్లేయస్త్రీలపై నిందారోపణ మొనర్చుట ఉచితము కాదు.

ఆం-వ—దేవరవారు సెలవిచ్చినది సత్యము.

శివా—మాయాడవారికి తురకలయందువలె ఘోషా లేదు. మీవారివలె పూర్ణస్వాతంత్ర్యమును లేదు. ఇది మధ్యమార్గము. మీరందరిక పోవచ్చును.

(ఆంగ్లేయులు శివాజీతప్ప అందరుపోవుదురు.)

మీరు వర్తకము చేయుటకే వచ్చినారా, లేక వీలు చిక్కినచో దేశమునుకూడ స్వాధీనపర్చుకొనవలెనను ఊహ కల్గియున్నవారా?

ఆం-వ—మహారాజుగారి కిట్టి సందేహ మేల పొడ మినది.

శివా—మరేమియు లేదు. వేడిపాలు ప్రమాదమున పెదవులకు తాకి నోరు కాలెనా, చల్లనిమజ్జిగయు నూదుకొని త్రాగజూతురు. తురకలు ధర్మస్థాపనము చేయు మిషచే ప్రవేశించి కాలక్రమమున మాదేశముల జయించినారు. ఆ మిష యిప్పుడు పాతగిల్లినది, వర్తకము క్రొత్తపుంత.

ఆం-వ—ఒకానొకప్పుడు విజయము ఓడిపోయినవారి మూలముననే సిద్ధించుచుండును.

శివా—అది నిజమే. ఏదీ, మీ సరుకు చూపుడు.

ఆం-వ—ఈ సరుకు హిందూస్థానము లోనిదే.

శివా—మా దేశపుసరుకు మా వర్తకులయొద్దనే కొందుము. నకుమ వ్యర్థముగా మీకు లాభము రానీయనేల? మీ దేశపు సరుకున్న చూపుడు. (వారు గుండుసూదులూ, సబ్బుబిళ్లలూ, మేకులు మొదలగునవి చూపుదురు.) ఇట్టి వస్తువులను మావారుకూడ తయారు చేయుదురు. ఇవి వాటికన్న పూతమెరుగున మిన్నలే, కాని మావస్తువులవలె మనజాలవు. నూతనవస్తువున్న చూపుడు. ఆగొట్ట మేమి?

ఆం-వ—ఇది దూరదర్శనీ యంత్రము. దీనితో చూడ దూరపువస్తువులు దగ్గఱనున్నట్లగపడును.

శివా—ఇది వింతవస్తువే. (చూచి) బాపురే! పూనా చుట్టుప్రక్కలనున్న గుట్ట లొకదాని నొకటి ఒరయు నట్లున్నవి. ద్రోణాద్రిని హనుమంతు డొకచోటునుండి వేఱొక చోటునకు మార్చినరీతి ఈయంత్రము గుట్టల స్థలాంతరమును చేర్చుచున్నది. ఇం దొకలోప మున్నది. ఈసామర్థ్య మొక కంటికే అలవడును కాని రెండింటికి చేకూరదు. దూరమున నున్న వస్తువులను స్పష్టముగా కనబరుచు ఈయంత్రమువలె భవిష్యత్తునందలి ఘటనాసంచయమును వర్తమానమున జరుగునట్లు అగపరచెడి యంత్రమును మీవారు కనిపెట్టిరా?

ఆం-వ—అట్టి యంత్రమును మేమెఱుగము గాని యంత్రిసాహాయ్యము లేకయే కాగలదానిని తెలుపగలవారు కలరు.

శివా—కొలదికాలమున జరుగగల సంగతులను అనుమానముచేతనే చెప్పవచ్చును, కాని సుదూరభవిష్యత్తు నట్లు చెప్పగలరని నాకు తోచదు.

ఆం-వ—మీభావిని గూర్చి నే నొకవిషయము చెప్పెద విందురా?

శివా—ఏమిటది?

ఆం-వ—మీరు త్వరలోనే ఉన్నతపదవి నొందగలరు. ఈదేశమునకు ప్రభువులు కాగలరు.

శివా—ఈయంశమును మీరెట్లు చెప్పగల్గితిరి.

ఆం-వ—మీప్రవర్తనను బట్టి నే నూహించితిని.

శివా—నే నొంటిగా అంతపదవిని బొందుటెట్లు?

ఆం-వ—మీరెంత ప్రజ్ఞావంతులో మీసేవకులుకూడ అంత ప్రజ్ఞావంతులు కాగలరు.

శివా—సహాజశూరులు, విశ్వాసులు, నగు సైనికులూ సమకూడుట నాయదృష్టమే కాని నాకు సహాయబలిమి లేకపోవుట గొప్పలోపము. మీరు నాపరివారమున చేరుదురా? అచిరకాలమున నేను జింజీరాకోటపై దండెత్తనున్నాను, అప్పుడు మీరక్కఱకువత్తురు.

ఆం॥వ—తమ రన్యదేశీయుల చేర్చుకొందురా?

శివా—వారు నమ్మకముతో కొలువొనర్చినచో నా కభ్యంతరము లేదు. బిజాపూరుసుల్తాను కొలువుచేసి విసుగుజెందిన పఠానుసైనికుల నా కొలువున నిల్పితిని.

ఆం॥వ—అట్లయిన నొకషరతుప్ప మీకొల్వున కొప్పుకొందుము.

శివా—అదేది?

ఆం॥వ—ఆంగ్లేయులతో తప్ప ఇతరులతో మేము పోరుదుము. ఆంగ్లేయులతో మీకు పోరుపొసగినా మేము వారితో చేరక తప్పదు. ఇట్లంటినని మీ రలుగకుడు.

శివా—మీరు దేశభక్తులగుట గని నాకేల కోపము రావలయును? నిష్కళంకమైన మీ దేశభక్తికి నేను కడు సంతసించితిని. పాదుషావారిని రోగవిముక్తులజేసి అందుకు మారుగ మీ దేశముకొరకు వర్తకపు సన్నదడిగిన వైద్యుడు మీవాడే కదా!

ఆం॥వ—అందు విశేష మేమున్నది? ప్రతిఆంగ్లేయుడును స్వలాభముకన్న స్వదేశలాభమునే ఎక్కుడుగా నెంచును. పాదుషా వారివలెనే మీరుకూడ అట్టి సనదు దయచేయ వలయునని ప్రార్థించుచున్నాను.

శివా—మీ దేశభక్తిని మెచ్చుకొంటిని కావునను మీ కట్టిసనదు నీయజాలను. మీ దేశభక్తికిని మా దేశహితమునకునూ పరస్పరవిరోధము కలదు. మీ త్రాసేక దేశమున కుదురుకొనెనా, దాని వెంట మీ ఖడ్గము కూడ జొరబడును.

వర్తకమును మిషచే మీరు నిరాటంకముగా మాదేశమున సంచరించుచు ప్రతిదానిలోను తలదూర్చి మాదేశశాంతి కెసరుపెట్టుదురు. ఈ దేశపాకాశమున మీతులారాశి ఉదయిం చినవెంటనే మీవృశ్చికరాశి ఉదయించి తీరును. మీరు నా భావిదశనుగూర్చి చెప్పినట్లే నేనుకూడ మీభవిష్యత్తునించుక చెప్పెద. మావారు మీవిషయమున అప్రమత్తులై వ్యవహ రించిరా, రెండు మూడు శతాబ్దములలో మాదేశమునంతయు మీరు వశపరచుకొందురు. మీ కుంపలి గౌరవముచేతనే మిమ్ము నా చెంత జేరనిచ్చుటలేదు.......రండు నేను మీరు మాకతిథులు: మిమ్ము యథావిధి సత్కరించుట మావిధి...
(పోవుదురు)

---

## ——ఆరవ రంగము——

---

శివాజీ రాణులు——శంభూజీ మోహిలే.

శంభూ——నికట సహవాసము లేక దృఢపరిచయము కాజాలదు. శివబా విషయముననే లేనిపోని అసత్యములు, నిందలూ వినివిని నామనస్సు కలుషితమై యుండెను. ప్రత్యె క్షముగా నేను పరికించు సరికి అంతయు వ్యతిరేకముగా కాన బడుచున్నది-ఏమి యౌదార్యము! ఏమి నిష్కలంకప్రవర్త నము!

సఈ——వారి రుచులెంత మనోజ్ఞములు! సన్నని చుల

కని వస్తువులు వారికిగిట్టవు, ముతకబట్టలు బరువైనవీ వారికి ప్రీతిదాయకములు.

సోయ—ఎగతాళి చేయుటలో మహారాజుగా రతి నిపుణులు.

శంభూ—సుకుమారవస్తువులన్నియు వాని కప్రియములని మీరెంచకుడు. ఆతడు మర్మజ్ఞుడు గుణజ్ఞుడు.

సతీ—గుణజ్ఞులైనను స్వదేశవస్తువులందు వారి కను రాగము మెండు. ఆంగ్లేయులు వారిదేశములోని వింతవస్తువులెన్ని చూపినను ఒకదానినైన అంటినారా ?

శంభూ—ఈ విభజన అచేతనవస్తువుల యెడనే-సచేతనముల గాంచిన ఆతనిచిత్తము చలింపకుండునా ?

సతీ—అది నిజమే- మొన్న పఠానులను నేడాంగ్లేయులను తమసైన్యమున చేర్చుకొనిరి.

శంభూ—అన్యజాతీయ పురుషులయెడ ఆదర ముండవచ్చును. స్త్రీలయెడ వారికిగల ఆదరముతీరు వేఱు.

సోయ—భర్తగారియెడ ఈవిషయమున ఎట్టిఅనుమానము నుండరాదు. చాంద్‌బీబీయెడ ఎంతయో గౌరవముండకుండిన ఆమెచీరెను నన్ను ధరింపుమని పట్టుబట్టుదురా ?

శంభూ—అందు వింతేమి ? అపరిచితమైన వస్తువును గురించి మానవుల కొకవిధమగు జిజ్ఞాస, ఔత్సుక్యము నుండుట సహజమే. అందును యవనస్త్రీలు ఘోషాలో నుందురు. వారినిగూర్చి అధికజిజ్ఞాస పొడమినచో వింతయేమి ?

సఖి — ఆంగ్లేయవనితలకు ఘోషా యుండదు కదా! వారు పురుషులతోఁగూడి ఆటలాడుదురను విషయమున మహా రాజుగారు వారిపక్షము బూనినది చూడ నాకు వింతపొడ మినది.

శంభూ — పోనిండు మగవారిచర్యల నింత సూక్ష్మ ముగా నాడవారు పరీక్షింపగూడదు. పురుషు లొకానొకప్పు డత్యంత సాహసకృత్యము లొనర్తురు. వారెంత ఉత్సాహ పరవశులైనను పనిచేయునప్పుడు వారి కలసట జనింపక మానదు. అట్టివేళల వారి మానసముల రంజింపజేయుట కొకప్రియురాలి సాన్నిధ్య మావశ్యక మగును.

సోమ — సేవజేయుటకు ఇగవుకు భార్యలు చాలరా?

శంభూ — భార్యల వడినివేసుకొని పురుషు లన్నిచోటు లకును పోవుదురా? శివబామాతోడ కళ్యాణదుర్గమునకు వచ్చు ననుకొనుడు. అప్పుడు మీరు వారివెంట రారుకదా? అప్పుడు జిజ్ఞాసచే-కేవల కౌతూహలమే-సుబేదారు రాణివా సము చూడవలెనని అతనికి బుద్ధిపొడము ననుకొనుడు. ఇది యట్టియూహాయే సుడీ—శివబాశీలము చాల నిర్మలము. లోకులు పలుగాకులై వానిగూర్చి ఏమోమో వెఱ్ఱిఅపవా దలు కల్పించుచుందురు.

సఖి — అవెట్టివి?

శంభూ — కుత్సితులు అపదూరుల కల్పింపబూనినచో వారినో ల్లెవరు మాయగలరు? అపవాదలకు తలాతోకా

ఉండునా? నిశీథమున శత్రువులపై బడుట మిష చేసుకొని దురాచారముల నెన్నియో యొనర్చునట! ఈమాటయందు పస యుండునా?

సఈ—ఇది శుద్ధాబద్ధము. శత్రువులపై అమాంతము పడునప్పుడు వెంటనే వారు శిబిరమునకు వచ్చి సైనికుల బ పుదురు, ఇది నాకన్నులతో చూచితిని

శంభూ—అవునా? ఆతడు శత్రువులపై బడుటకేగెనో, ఇంకే పనిమీద పోవునో ఎవ రెరుగుదురు అని లోకులు కూయుదురు. లోకులమాటలనే నేను అప్పచెప్పుచున్నాను సుడీ-శివబా సచ్ఛీలుడనియే నానమ్మకము.

సఈ—వెంటనున్న సైనికుల కన్నులలో దుమ్ముజల్లి రహస్యముగా వా రొంటరిగా వ్యవహరింతురా? ఇది నేను నమ్మను.

శంభూ—కుటిలుల కుశల్పవలకు అంతముండునా? చీకటిలో సైనికు లందరూ లూటీలో చిక్కుకొని యుందురు. ఎవ రెచ్చట నేమిచేయుచున్నారో చూచే దిక్కుండదని వా రందురు...శివబా కలియుగశుకుడని నా అభిప్రాయము. నా మాట లోకుల కొకనిదర్శనమా? ఆవగింజంత అవకాశమును కొండంత దోషముగా వారు కాపింతురు. శివబా స్వైరవిహారమునకు వారుచెప్పు హేతువు మీరు వినలేను కాబోలు. అది మీకు తెలుపుట కభ్యంతరము లేదు, అందు తథ్యము లేనేలేదు, ఒకవేళ ఉన్ననూ మీరు ప్రాజ్ఞులు - కావున దాని

సంతగా పాటిసేయరు.

సోవా—కారణమేమి ?

శంభూ—దాని కాధార మెద్దియైన నున్న అవశ్యము చెప్పెదను. ముందు నాప్రశ్న కుత్తరమిందు. సఈబాయి! నీవివాహము శహాజీ మహారాజుగారి సమ్మతిపై జరిగినదా?

సఈ—లేదు, జీజీబాయిగారి సమ్మతి నైనది.

శంభూ—ఆఁఆఁ. సోయరాబాయీ నీవివాహము నేనన్నట్లు జరిగిన దేనా ?

సోయ—ఔను. నాపెళ్ళి కాకమునుపు «మీరూ మేమూ లేనపు డైనది ఏటిపెళ్లి ?" అని పాదుషా మామ గారితో నన్నారట. అక్కా కోపగించుకొనకుము.

సఈ—నిజము చెప్పితివి, దానికి కోపమేల ?

శంభూ—ముందుమాటను మీరు విన్నచో ఒండొరు లతో కలహింపక ఉభయులూ ఏకీభవించి శాంతలై కార్య మునకు కడంగుదురు. మొదటివివాహము పాదుషా శహాజీల సమ్మతమున కానందున వారు దాని నంగీకరించలేకనియు, పైపెచ్చు తనసమ్మతితో నొక వివాహమేని కానందున శివబా తనకిష్టమైన మూడవభార్యను చూచుకొనవలచినాడని జనశ్రుతి కలదు. వారు తమ కుయుక్తులకు ఎట్టికారణము గూర్చిరో విశదమైనదా ? నోటికి వచ్చినట్లెల్ల వాగుదురు. వారినోటికి తలుపా ద్వారబంధమా ?

సోయ—వలచివలచి తురకదానిని కట్టుకొనరు కదా!

శంభూ—అది కలలోనిమాటకూడ కాదు. తల్లిగా రొకవివాహము చేసిరి, తండ్రిగా రొకటి చేసిరి. ఇప్పుడు లోకులు మూడవది చేయనున్నారట! శివబా తురకదాని వలచుటేమి? దాని నగ్నిసాక్షిగావివాహము చేసుకొనుటేమి!

సోయ—పెండ్లియాడకున్న వేశ్యగా నుంచుకొమ్మందురు కాబోలు!

శంభూ—దానికి లోటులేదు. ఇప్పుడు కళ్యాణదండయాత్ర కన్యకొఱకే శివబా తలపెట్టినాడని వదంతి-ఎక్కడకు బోయిన నివియే గుసగుసలు. శాత్రవస్త్రీలను సైనికులెవరునూ హింసచేయకూడదని మహారాజు శాసించినప్పటినుండియు "రాణివాసమును వారే స్వాధీనము చేసుకొందురు కాబోలు"నని వాగుచున్నారు. ఇట్టి అపనింద వారు రాజుగారిపై వేసినందుకు వారికి తగినశాస్తి కావలయును.

సోయ—ఆ చచ్చినవారి నాలుక లూడిపడును. వారి అపనిందల నక్కరసేయువా రెవ్వరు? ఎద్దుకేమి తెలుసు నటుకుల రుచి? మామీద మహారాజుగారి కెట్టి యాదర మున్నదో ఈకుంక లేమెరుంగుదురు? వారు మామాట నెప్పుడేని జవదాటుదురా?

సఈ—ప్రాణనాధుడు శోయరాబాఈ రూపము నెంతవలచిరో నే నెరుగుదును.

సోయ—సఈ బాయి సౌజన్యము వారి కెంతసంతోషదాయకమో నేనెరుగుదును.

శంభూ——బలే-సాపత్న్యలయ్యు మీ రింత కలుపుగోరు తనముఁ వహించియుండుట నాకు అనంతమగు సంతసము కూర్చు చున్నది. మీపల్కు-లే నిజమైనచో ఎట్టిచింతయు అనవసరము. అతనియం దట్టినమ్మకమే మీకు లేకున్న కళ్యాణదుర్గమును స్వాధీనము చేసుకొనిన తోడనే శివబా అటపోవునప్పుడు అతనివెంట బోవుటకు మీరు హఠముచేయకుందురా?

ఇద్దఱు——అమ్మయ్యో! కళ్యాణదుర్గమునకు మహారాజుగా రేగనున్నారా?

శంభూ——బహుశా పోవుదురు. ఈకండయాత్ర సామాన్యమైనది కాదు. ఇందు జయము నొందినచో విశాలమైన ప్రదేశము మనకు లోబడును. కావున అందుకు వలయు నేర్పాటులు కావించుట, సైనికుల బహూకరించుట మొదలగు పనలు మహారాజుగారు స్వయముగా చేయవలసి యున్నది. అంతకన్న నావశ్యకమగు కార్యము నెరవేర్చవలసి యున్నది. సైనికులు——స్త్రీల నెట్టి బాధలపాలు చేయగూడదను కఠిన శాసనమున్నది, అది సరిగా నిర్వహింపబడినదో లేదో వారు విచారణ సేయవలయు. అవ దావశ్యకమయినచో ఏకాంతమున అంతఃపుర స్త్రీల వాఙ్మూలము లను పుచ్చుకొనవలయును.

సఈ——నిజముగా నేనా?

శంభూ——అంతవరకును రావచ్చును. శివబా న్యాయప్రియుడు కదా? అంతఃపురస్త్రీలను స్వయముగా విచారణ సేయకున్న నిజము తెలియదు, అది తెలిసినగాని అతని మన

న్సమాధానము కాజాలదు. అందుకు ఎన్ని రాత్రులు మేలు కొని యుండవలయునో?

సో౯యా——రాత్రులు మేల్కొ నసేల ?

శంభూ——పగటి విచారణలతో పని తీఱకున్న రేలు కూడ విచారణ సేయవలదా ? అదియునూ కాక రహస్యము నకు రాత్రియే అనవు.

స ఈ——అట్లైన మే మవశ్యము వారిచెంద నుందుము.

శంభూ——మీరు వెంటనుంట వృధ. అందు కాతడు సమ్మతించునో లేదో ?

స ఈ——ఆ నాజ్ఞాలముల మేము వినిన ప్రమాద మేమి?

శంభూ——అవి మీరు వినదగిన వనుకొంటిరా ? న్యాయాధికారి భార్య కాని గౌరవనీయయగు ఇతర స్త్రీగాని చెంతనున్నప్పుడు కులీనలగు కాంతలు ఉన్నమున్నట్లు వెలి బుచ్చుదురా ? శివబా ప్రవర్తనము నెడ మీ కనుమాన ముదయించినచో మిమ్ముల నుండనిచ్చుట యోగ్యమగును. అట్లొనర్చుటకు తగినంత కారణముండవలయు. వారికి మీ యెడ నసమానాదర మున్నప్పుడు మీ అనుమానమున కనువు లేదే ?

స ఈ——ప్రాణనాథునిశీల మతిస్వచ్ఛమని లోకుల కన్నులముందర తార్కాణించి చూపి వానినోళ్ళు మూయ వచ్చును.

శంభూ——అట్టి అభిప్రాయమే మీకున్నచో అభ్యం

తరమే యుండదు. శివభాను పరీక్షించుట కవకాశము కల్గినా, దానిని ముందుగా మీ కెరింగించి నాశక్తికొలది సాయము చేయుటకు నాకును వీలుపడును.

సోమ——అట్లైన అత్యుత్తమము.

శంభూ——మీరీవిషయమును మహారాజున కించుకేని తెలియనీయకూడదు. మీజాడ కని ఆతడు మెలకువతో మెలంగును. అట్టియెడ నాతని వర్తనము కృత్రిమమగును. అప్పుడు పరీక్షలో నాతడు కడతేరినను అదియొక గొప్ప కాదు.

సహ——నిజమే.

శంభూ——మీరుభయులును నాకాప్తి శివభా మనసునకు నచ్చజెప్పి తిరుగ నాకుద్యోగము నిప్పించితిరని నాకు తెలిసినప్పటినుండియు మీ అప్పెట్లు తీర్తునను ఔత్సుక్యముండెను, కాని ఇంతవేగ మట్టిఅవకాశము చిక్కునని కలనైన నేదలపలేదు. చిక్కినదానిని చేవిడుదునా ? ఇక నాకు సెలవు ......(పోవుదురు).






# రెండవ అంకము

## — మొదటి రంగము —

(ముల్లానా అహమ్మదు, మహమ్మదు)

అహ — కాఫరగు శివాజీ అదిల్‌షామీద నెన్నియో అపరాధములు సల్పిననూ అతని తండ్రియగు శాహాజీ మోమోటముచే సుల్తానువారు వాని మన్నించుచున్నారు, కావున అంతకంతకూ వానికి పొగరెక్కువగుచున్నది. మొన్న మనము బిజాపూరునకు గొనిపోవుచున్న ధనమును దోచుకొనుటయే కాక మనపైకి దండెత్త సన్నాహములు చేయుచున్నాడని వినవచ్చెడిని. మన కవమానమొనర్చుటయన్న సుల్తానువారికి కొనవచ్చులే అని యెరుగరు. ఒక్కమారా రాసింహాము కన్ను లెఱ్ఱచేసిన ఈ కొండయెలుక నావమానశేషము కాదా ?... కుమారా, మనసైన్యము సిద్ధముగానున్నదా ?

మహ — జనకా, నే నిప్పుడే చూచి వచ్చితిని. మొన్నటి లూటీచేత ఇంచుక నిరుత్సాహము కలిగినను మొత్త

మునమున ఏర్పాటులు సరిగా నున్నవి-క్రొత్త ఉమేదువారులు అనుదినమూ చేరుచునే యున్నారు, అచ్చటచ్చట కాపుగడల నుంచి, ముఖ్యమైన మార్గములయందు ఫిరంగుల సజ్జిత మొనర్చి, నలుదిక్కుల వేగులబెట్టి, మరాటసైనికుల పోకడల గుర్తించి మనవారు వర్తించునట్టుల జతనపరచి వచ్చితిని.

అహ—నీవు జాగరూకుడవై యుంటివి కాని, మరాటాల పోరితము తీఱు వేఱు. వారు కొండమలేడులవలె పరుగెత్తుదురు; భీమానదిలో మొగము కడిగి, గోదావరిలో స్నానమాడి తాపీనదియొడ్డున భుజింతురు. ఎట్టి దుర్గమపర్వతముల నైన రెప్పవేయునంతలో నెక్కుదురు. కొండల లోని రహస్యమార్గము లన్నియు వారికి సుపరిచితములు. అదలించుటలో వా రద్వితీయులు-ఇట్టి సాహసులు, యుక్తిశాలురైన శత్రువులతోడి పోరు నా వార్ధకమున ఘటిల్లెకదా అని చింతించుచున్నాను. ఐనను మనశౌర్యమూ, ధైర్యమూ మొక్కవోకుండునట్లు కార్యముల నిర్వహింతుమని నాకు విశ్వాసము కలదు. నీవు సహజశాంతిపరుడవు, అమాయికుడవు- ఈజత్తుల మారులతోడి యుద్ధమున నెగ్గగలవో లేవో అను శంక నన్ను బాధించుచున్నది.

మహ—నేను నిసర్గశాంతస్వభావుడనగుట కలహామున కన్న కలయికయందు నాకు ప్రీతి ఎక్కువ—కాని వీరపుత్రుడగాన యుద్ధప్రసంగమువచ్చినపుడు వెనుదీయువాడను కాను.

అహ—నాయనా, సంధి యన్నమాట తలపునకు

రానీయకు-మరాఠాలకు పేరాస మెండగుటచే ఈప్రాంతమంతయు నొక్కసారి గుటకవేయవలయునని వారి యుద్దేశము. కలుపుగోరుతనమును వారు కలనైన నెఱుంగరు. ఒకసారి సంధి కొడంబడినను అచిరకాలమున దాని నతిక్రమింతురు-వారిని బోలు విశ్వాసఘాతకులు, పోకిరులు నికలేరు-వారితో సంధి పొసగనీయక సమరముననే సర్వమును చక్కజేయవలయును.

(సేవకుడు వచ్చును)

సేవ—మహాప్రభూ! హసీనా బీబీగారి ఘట్టింటినుండి ఒకబంటు జాబుతీసుకొని వచ్చినాడు-ఏమి సెలవు?

అహ—వాని నిటకంపుము. (గుల్‌జార్ ఖా ప్రవేశించి వంగి సలాముచేసి అహమ్మదుచేతి కుత్తరమీయగా నాతడు దానిని చదివి) మావియ్యంకుల ఆశ్రితులా మీరు! లూటీవర్తమాన మెఱిగి వారు మిమ్ముల సహాయ మంపినారు కావున మీకు సైనికశిక్ష చక్కగా అబ్బియుండవలయును.

గుల్—దేవరా, నే నది చెప్పకొన దగునా? కొలది కాలమున మీ కది గోచరించును. నేనింతమట్టుకు మనవి చేసుకొనగలను. మల్లయుద్ధము, గరిడీ, కత్తిత్రిప్పుట, ధనుర్విద్య గుఱ్ఱి మొదలగువాటియం దారిదేరితిని.

అహ—సంతోషము. మీవయసు కొంచెము ముదిరి నట్లున్నది. విద్యాభ్యాసము నించుక ఆలస్యముగా చేసినట్లు తోచెడిని.

గుల్—అందు కొక కారణము కలదు. కొంతకాలము కులవృత్తిలో నుంటిని.

అహా—అదేది ?

గుల్—అసియు శస్త్రములకు సంబంధించినదే. అందును మెడపై కత్తివేయవలయు. ఉన్నతస్థలమున నున్న వానిని సరికి నేల బడవేయవలసి వచ్చును. అప్పుడప్పుడు శరీరముల మర్దించి నరముల మెత్తజేయవలయును. ఆవృత్తికిని సైనికవృత్తికిని కొంతభేద మున్నది. దానిలో రక్తము కంటికగపడిన చాతుర్య మనిపించదు, ఇందగపడినా చాతుర్య మనిపించును.

అహా—ఓహో ! క్షౌరమా ?

గుల్—నాకది ఉపరికు సాధ్యమే కాలేదు. నేను చిమ్మజేసిన రక్తబిందువుల జూచి, సేనలో ప్రవేశించిన నేర్పరియగు బంటు నొకనిని కొందరు సూచనసేయ నావాడుక వారును మావారిని ఏకగ్రీవముగ దాని నామోదించిరి. మఱునాడే సమరవిద్యాశాలలో చేరి మొదటినుండియూ వాడిగల పనిముట్లను మచ్చికచేసిన వాడనగుటచే అచిరకాలమున ప్రావీణ్యము నార్జించితిని.

అహా—వయఃప్రారంభవత్సరములు వృథా అయినట్లే.

గుల్—లేదు, దేవరా ! అట్లుకాదు. ఆవృత్తిలోని మనుష్యుల కాలోచన ములవడును ; చేయి యొకరితలమీద

తిరుగుచుండ బుద్రలో బుద్ధి పెరుగుచుండును. అందుననే నూతనుడను ఉపాయశాలురని పేరువడసితి. బహుభాషణము మాను ముఖ్యాలక్షణము- నాకు ఖడ్గచాతుర్యమూ వాక్చాతుర్యమూ, అలవడినవి.

అహ—ఆలయములో ఆలోచనవలన ప్రయోజన మేమి?

గుల్—ఏమి? యుద్ధము సేయునప్పుడు సాధారణముగా సైనికులు ముందువెనుకల నాలోచింపరు. అవిచారమే భూషణమని నాది యూహ; అందుచేతనే పరాజితు లగుదురు- నేనుమాత్రము తేపతేపకు నాలోచించియే అడుగిడుటకు సిద్ధాగణ చేసుకొంటిని, కావున నాకు జయము చేకూరుచున్నది. యోధుని సాహసము యోగి తత్త్వజ్ఞానము నాలో సమకూరియున్నవి.

అహ—ఈ శక్తిద్వయమును బీజాపూరుననే సార్థకము చేసుకొనక ఇటకు వచ్చుటకు హేతువేమి?

గుల్—శివాజీ యను పేరుగల వాడొకడు బాహుబలమున నొకసుల్తానై విజృంభించుచున్నాడట- ఆతనితోడి ఆలమున కొంతపేరు వడయవలెనని యెంచి యిట వచ్చితిని. బిజాపురమున నాపురోవృద్ధి కనుకూలపరిస్థితు లంతగా లేవు. శివాజీ వారిపై కత్తినెత్తుటకు ముందు వాని గర్వమును ఖర్వముచేసి, ఆతనియల్లరుల నంత మొందించవలెనని నాయూహ శివాజీవలెనే నాభాగ్యచక్రమును బాహుబలము నాధారము చేసి యుంచితిని.

అహ—మాావళాల పరాక్రమము మీాకు పరిచితమా?

గుల్—ఇప్పుడే వచ్చుచుండ వారిని స్వయముగా గాంచితిని. వారి శరీరములు కృశించియున్నవి. నా మెడలో నాల్గవ పాలైన వారిమెడ యుండదు. ఇక వక్షము మణికట్టుల మాట చెప్పనక్కఱయే లేదు. మాావళాలను మణికట్లబలము చేతనే జయింపనెంచితి.

అహ—వారు యుద్ధముల నారితేఱినవారు, నీకు యుద్ధానుభవమే లేదాయె.

గుల్—క్షమింపవలయు. వారు వయసున చిన్నవారు, అట్టివా రారితేఱిరనిన నేను నమ్మను. వారిలో నెవ్వరికీ మీసమే లేదు, గడ్డము లేదు, నావంటివాని వాలు గడ్డమును చూచి భయభ్రాంతులగుదురని నా నమ్మకము.

అహ—మీాకు మా హసీనా బీబీతో పరిచయమున్నదా?

గుల్—శైశవమున నామె నాడించితిని-ఆమె నన్ను మరచియుండు నీపాటి, నేను మాత్రము మరువలేదు.

అహ—సరే-నాయనా ముహమ్మద్, ప్రకృతమున నీతని బీబీమహాలును కాచుటయం దుపయోగింతము. ఇక నేను విశ్రమింప నేగెదను, నీవును నేగవచ్చును.

ముహ—నే నొకసారి యూరంతయు చూచివచ్చెద. మీారు స్వస్థచిత్తులై యుండుడు. (గుల్‌జారుతో) మీావెంట నొకమనుష్యు నిచ్చెదను, వాడు మిమ్మల బీబీగారి మహాలు

చేస్తును. అచటివారు మిమ్ము లోనికి గొంపోనొదరు. నేను వచ్చువరకు మీరు బీబీగారిని చూడవలదు. ఎవ డక్కడ (ఒక సేవకుడు రాగా వానిచెవిలో ఏమో చెప్పును. అతడు గుల్జారును తీసుకొని పోవును) నేను హసీనాతో నాటలాడు టకు వీలులేదు. ఒకప్రక్క రణసన్నాహము, ఇంకొకప్రక్క రహస్సల్లాపములా? ఒకవంక వీరరసమూ, రెండవవంక శృంగా రమూ, ఒకదెస కంఠమున కుఠారారోపణము, ఇంకొకదెస కంఠమున హారారోపణము, ఒకచక్కి శరశయ్య, నింకొకచక్కి పుష్పశయ్య! ఆహా ఈ సంసారము ద్వంద్వమిశ్రితము. సుఖ దుఃఖములు, ఒకదాని నొకటి అంటి యుండును. వాటి నను భవించుటకు మానవుడెప్పుడును సిద్ధముగా నుండవలయు- ఇందలి పరిణతి పరమాత్మచేతిలో నున్నది——

---

——రెండవ రంగము——

---

గుల్జార్——అమీనా

గుల్——అమీనా, నా మణికట్లు బలముచేతనే దక్షి ణాపథమున నొక రాజ్యమును స్థాపించుకొనవలయునని నా యుద్దేశము. శివాజీశత్రువు శ్రీడగించి పూనాలో రాజధాని నేర్పరచుకొని అతనిమేడనే నారాజభవనముగా నుపయోగిం చుకొనెద. మానవశవాల మట్టిలో గలిపి మావారి నటజేస్తును. శివాజీ నాచరణములపై వ్రాలి ప్రాణభిక్ష యాచించెనేని

అతనికి జీవదాన మొసగి నా ముఖ్యపరిచారకునిగా నొనర్చి తిను. రణరంగమున నేను క్రూరుడనైనను సహజముగా నుదారుడను.

అమీ——శివాజీ చపలుడని మీరే సెలవిచ్చితిరి కదా అట్టివాడు మీకు పరిచారకుడుగా నుండగూడునా?

గుల్——అతనిని తగినపనిలోనే నియమింతును. ముం దు రాజోచిత ఉన్నతపదవికి తగినట్లు హుక్కా నొకదానిని జాగ్రత్త చేసినాను. దాని నాళము నూరుమూరల పొడవు, మేడమీద చివరఅంతస్థుననున్న నా నోటిలో దానికొన యుండ క్రిందియంతస్థున నున్న నాభార్యలు వంతులచొప్పున నిప్పు నించుచుందురు.

అమీ——భార్య లెంతమంది యుందురో?

గుల్——ఆలెక్క నియమించుట నీ పని.

అమీ——అదేమి?

గుల్——బాగుబాగు-ఈ విషయము నాపట్టపురాణి గాక ఇతరు లెవ్వరు నెరవేర్పగలరు? నా చిన్ననాటిసఖి గాక ఇతరులెవరు నాకు పట్టపురాణి కాగలరు.?

అమీ——మీరు నాకాగొప్పపదవి నొసంగ చేయుదురన్న సంతసమే కాని ఇందు నాసలహా మీరు పుచ్చుకొన నక్కర లేదా!

గుల్——ఏమి-ఇది నీ కిష్టము లేదా?

అమీ——సవతులు లెక్కలేకయుండ వత్సరమున

కొకపాఠిదైన భర్తృసందర్శనము లేని పట్టమహిషిపదవి పడతులకు ప్రశంసనీయము కాదు.

గుల్ — నీ వెంత వెఱ్ఱిదానవు! పట్టపురాణితో ప్రతి దినమును పరామర్శించక రాజకార్యముల నిర్వహించు టెట్టులు?

అమీ — రాగలపదవి యెట్టిదో కాని ప్రకృతమున చీపురుకట్ట అలుకుగుడ్డ పట్టుకొనుటచే చేతులు చిల్లులుపడు చున్నవి.

గుల్ — నాకు ప్రభుత్వ మబ్బెనా, అలుకుగుడ్డచే నీ చేతి కలకువ రానిత్తునా? నీమాట కులక రానిత్తునా? అది కురాన్ సూత్రమువలె అనల్లంఘ్యమని శాసింతును.

అమీ — అటులైన నా కేచింతయు లేదు.

గుల్ — మన మారగించుటకు వివిధపక్వాన్నముల జాబితా తయారుచేయవలయును. ఎన్నిరకముల మద్యము లెచ్చటెచ్చటనుండి తెప్పించవలయునో, దాని కెంతద్రవ్యము కావలయునో ఇప్పుడే నిర్ణయించుకొందము. —ఇవెన్ని గందర గోళ మగును. ప్రతిఅంశమును ముందే ఆలోచించుకొని యుండుట మంచిది. అట్లు చేయక నే నేకార్యమునకును కడంగను.

అమీ — మీవంటి దూరదృష్టి, గాఢాలోచన గల వారిని నేను చూడలేదు.

గుల్ — దీనికే నీవు నివ్వెఱపడుచుంటివి. నా గోర్కె

సమాచారము వినిన ఏమనుకుందువో? నేను చచ్చుటే కడవు, నాగోరీ ఎట్లు నిర్మించునది, ఎంత విలువ యుంచునది తాపీపనివారి సెలనుండి టప్పించునది, రాళ్ళుచెక్కువా రెట్టివారో మొదలగు ప్రతివిషయమూ సకృచ్ఛముగా నిశ్చయించి యుంచితిని. ఎందుకొఱకూ వెతకుకొన నక్కఱలేదు. సర్వము శాసించి సిద్ధాంతపరచి యుంచితిని.

అమీ—దూరపుసంగతుల గూర్చి ఏర్పఱచుటలో మీదూరదృష్టి గొప్పదే, గాని మీగాలిమేడకు గట్టిపునాది కలదో లేదో ఊహించితిరా? మరాఠాలను జయించుటయే కదా మీకల్పనములకు మూలాధారము?

గుల్—అ దెంతసేపు. మహారాష్ట్రుల జయించుట నా కొక లెక్కయా! వారు నాకంట పడిన చాలు. ఇంతకూ దేవు డిచ్చిన ఆయువు అంతమైనగాని వారు నాపైకి రారు; వచ్చినవెంటనే చచ్చుట తప్పదు—ఆవెఱ్ఱి పూనాలో పూటుకొనుట నిశ్చయము. పిమ్మట భోగరాగాదులు-అన్నియు సరిగా నున్నవి. వారు వచ్చుటయే తడవు. ఇంక కొన్నిదినములోపికబట్టి ఆవెఱ్ఱి వారిని నేనే వెదకబోయెదను.

అమీ—ఎచటికో పోనక్కరలేదు. కొలదికాలముననే కళ్యాణదుర్గముపై వారు దండువిడియ నున్నారని పుకారు కలదు.

గుల్—నే నిచట నున్నానని తెలిసియే వా గీదండయాత్ర తలపెట్టి యుందురు- నన్నొకని జయించినచో నంద

టిసి జయించవచ్చునని వారి యూహ. కత్తికఠారి, పిస్తోలు గాకు బల్లెము మొదలగువాటిని నేను సిద్ధముచేసుకొనవలెను. ఏది యెప్పుడు, ఎవరిమీద, ఎట్లు ప్రయోగించవలెనో ముందే నిర్ణయింపవలెను. ఇంకను రొకసారి సన్న తలపడితేని రెండు చేతులతో పోరవలయు- నా యుద్ధచాతుర్యము నీవు వినియుంటివే కాని, కని యుండలేదు. ఈసారి చూడ వచ్చును.

అమీ—చేతినేర్పు కాలినేర్పు రెండును గాంచవ చ్చును. నేను బీబీగారి చెంతకు బోవలయు- ఇల్లు వెడలివచ్చి ఎంతయోసే పయెను.

గుల్—బిబీగారితో నా విషయమేమియు చెప్పవలదు సుమా. (పోవుదురు)

---

## —• మూడవ రంగము •—

---

అంతఃపురమున హసీనా-

హసీ—(అద్దము చూచి దిద్దుకొనుచు) ఎంత పాటు పడిననూ ఈ కుటిలకుంతలము నాకు లొంగకున్నది ఎంత పైకి దువ్వినను తిరుగ క్రిందికే వాలుచున్నది. కుటిలు ల గతి యిట్టిదే, తిన్నగా నుండజాలరు. కుంతలమా, నీ కుటిల బుద్ధి మానవా? కుత్సితుడగు శివాజీపోలె నా లావణ్యనిధిని దోచుకొనదలచితివా? మావారిసొత్తు నీచేత జిక్కనుకాని

ఈసొత్తు నీకు స్వాధీనమగునది కాదు- (మవ్వి) ఆఁ వెక్కుకు మరలినది- ఏమిది శిరోజములకు మానవభాష తెలియును. కాబోలు, అవును. అలకలకూ భావకూ పుట్టిల్లు శిరమే. వా రొండొరుల నెరుంగుట వింతకాదు. అదియునుంగాక కుటిలులకు కూడ కొన్ని విషయముల నార్జవ మబ్బుచుండు ను...ఇక నీ కేశపాశముపై మల్లెపూ వమర్చెద. గగనమున చంద్రబింబమువలె నిది రాణించును. ఈజడకు చేసిన శృంగా ర మెవరికొఱకు? దాని యందము నాకన్నుల కగపడ దే? నాచెంపల ఎరుపును నాపెదవులు గ్రోలునా? ఈయద్దము చూడకున్న నా చెవులు నాకగపడవు. ఇక బాహ్లీ మాట చెప్పనక్కరయే లేదు. పురుషుడు చెంతలేనప్పుడు స్త్రీలు సింగారించుకొనగూడ దనుట యుక్తియుక్తముగనే యున్న ది. ఈ యద్దము నపుంసకము కావున దీనికి కొన్ని పురుష లక్షణము లబ్బినవి. స్త్రీలసౌందర్యమును తన నిర్మలాంతరంగ మున ధరించును. ఇది చంచలము- ఒక వస్తువున తన లక్ష్యము నిల్పక ప్రతివస్తువును చూచుచుండును. ముఖస్తుతి చేయుట దీని స్వభావము. సముఖమున నున్నవారియందే తనధ్యానమును లగ్నమగునట్లు చేయును, వారు మరలిన తోడనే వారిమాటయే మరచిపోవును. ఇది మగవారికి సహ జమే. నానాధుడు నేను పెండలకడ వత్తునని నమ్మించి పోయెను. ఇటనుండి వెడలినతోడనే ఈ మాట మఱచెను. అంతఃపుర నిర్బంధము కలవారము కావున మాకు పతిచింత

దక్క వేఱు ప్రసంగమున కవకాశమేలేదు. అందుచే మా కది అత్యంత ప్రీతిదాయక మగును. పురుషులు స్వేచ్ఛా విహారులు, వారికి స్త్రీరూపములు కానవచ్చును, పాత వంతతో మరచి పోవుదురు. (మహామ్మదు వచ్చును.)

మహా—ప్రేయసీ, ఏ మాలోచించు చుంటివి.

హాసీ—ఒక ప్రణయినీవల్లభ యుగళము లీల గాంచు చుంటిని.

మహా—ఇందు మనము తప్ప వేఱు యుగళ మున్నదా ?

హాసీ—లేకేమి ? మనకన్న శ్రేష్ఠతరమైన యుగళము కలదు.

మహా—శ్రేష్ఠతరమా ?

హాసీ—సందియ మేల ? మనము కండనెత్తురులు గల బొమ్మలము, ఇది జడసృష్టి; ఆయుగళము కేవల రూపాత్మకము-వారి శరీరములకు పరిమాణ తారతమ్యములు లేవు.

హాసి—నా కాయుగళము కాన్పించుట లేదే ? వారీయంతఃపురము నెట్లు చొరగల్గిరి ?

హాసీ—ఆయుగళమునకు క్రోధమాత్సర్యములు లేవు.

మహా—చిత్రముగా నున్నది. నాకిందేదియును కాన్పించుట లేదు. ఏదీ ఆయుగళము నొకసారి జూపుము.

మహా—ఈకిటికీ కెదురుగా నిల్చి చూచితిరేని వారు మీా కెదురగుదురు.

మహా—(ఎదుటనిల్చి) ఓహో-ఆ యుగళము మన యుగళమే.

హాసీ—కాదుకాదు, మీ మెడమీద మచ్చ యున్నది. అతని కది లేదే?

మహా—అతడు తన మెడను నీవైపునకు త్రిప్పినచో అతని మెడమీది మచ్చ మనకు కనబడును.

హాసీ—మీరిటకు రాకపూర్వము అతనివీపు నావైపునకే యుండెను. ఆ పురుషుడు నా చిత్తమున ప్రవేశించినాడు.

మహా—పరేకాని నీకనులు గుంటలుపడినవి, నీ మోము వాడియున్నది, హేతువేమి?

హాసీ—అదేమో నే నెఱుగను.

మహా—మరాఠాలు మనపై దండెత్తుచున్నారని నీవు వెంగగొంటివా?

హాసీ—వారి ఘోషయేల? మీరు త్వరలో వత్తునని బాసచేసితిరి జ్ఞప్తి యున్నదా?

మహా—లేకేమి? అనివార్యములగు రాచకార్యము లుండుటచే రాలేకపోయితిని.

హాసీ—అవెట్టి?

మహా—మరాఠాలు నేడే వత్తురో రేపు వత్తురో అను సదంతి విని మనదుర్గమున మనభటులు ఆప్రమత్తులై యుండిరో లేదో చూచి, కొన్ని క్రొత్త యేర్పాటులను చేసి క్రొత్తవారిని కొందఱిని సేనలో చేర్పవలసివచ్చెను.

హాసీ—క్రొత్తనీరు వచ్చి పాతనీటిని కొనిపోయెను కాబోలు-ఇట నాగతి యెట్లున్న మీ కేమి?......అయ్యో! నాకు మతి భ్రమించినట్లు ఎటు చూచినను అదురాత్ముడు శివాజీయే కనబడుచున్నాడు, నాకుంతలముల చూచుకొన్నను వాని కుటిలవృత్తియే జ్ఞప్తికి వచ్చుచున్నది.

మహ—బేలా, నీవు భ్రమచెంద నేల? వాడు మన కొనవ్రేలు కదల్పజాలడు-నీశరీరభాగములతో శివాజీని పోల్పకుము. ఆతని చూచినతోడనే నీవు జ్ఞప్తికి వచ్చుటచే నాతనిపై శస్త్రము వేయ నాచేయాడదు.

హాసీ—అట్లు కానేల? నాశరీరమును చూచినతోడనే శివాజీ జ్ఞప్తికివచ్చి క్షతములతో దానినింప రాదా? కాని వానివలె నేను వెన్నిచ్చుదాన గాను. నాశక్తికొలది నేనూ మాఱు సేయుదును.

మహ—భావిసంకటముల దలచి మనము ప్రేమాలాపము లాడుకొనుచుంటిమి, ఇవి తాత్కాలిక సుఖము నిచ్చుచున్నవి-కాని ప్రత్యక్షముగా సంకటము వాటిల్లునపుడు మాత్రము ఈసల్లాపములు యాదికివచ్చి ఆయవస్థను నిర్భర మొనర్చునేమో?

హాసీ—అప్పటి మాట లిప్పుడేల?

మహ—మాటలు మానినంతనే సంకటములు మానునా? రానున్న విపత్తులగూర్చి చక్కగా నాలోచించి ఏసందర్భమున నెట్లు వర్తింపవలయునో ముందే నిశ్చయించుకొనుట

మంచిది. ప్రియసీ-మరాలులు విజయమొంది మనల నెడబాపు నెడ నీవెట్లు ప్రవర్తింతువు.

హాసీ—ఏయుక్తి చేతనేని వారికన్నుల దుమ్ముజల్లి మిమ్ము కలుసుకొందును.

మహా—మనసమాగమము అసంభవమైనచో—

హాసీ—అంతగతి పట్టునప్పు డాత్మహత్యయే శరణ్యము. అందు కేయుక్తియు నక్కఱలేదు, ఏయత్నమును చేయ నవసరముండదు.... చూచితిరా ఈకటారి, దీనినెల్లప్పుడును నాయొద్దనే ఉంచుకొనెద.

మహా—అది హరింపబడిన-?

హాసీ—నాథా, ప్రాణముల రక్షించుట కష్టసాధ్యమగునుగాని వాటిని త్యజించుట సులభము. ఉరిబెట్టుకొని ఉసురువీడెద.

మహా—శత్రువు లట్లుచేయనీకున్న?

హాసీ—వారంత క్రూరులా? శత్రుస్త్రీలు చత్తురన్న వారికి సంతసము కల్గునుకదా?

మహా—పురుషులు తాము ప్రాణముల త్యజింతురు. కాని స్త్రీల నట్లొనర్పనీయరు.

హాసీ—ఏల?

మహా—ఇంత చక్కనికాంత వారిచేత జిక్కినపుడు వారు వదలుకొందురా?

హాసీ—నాకన్నులు గుంటపడినవి, మోము వాడి

యున్నది అని మీరే ఇప్పు డంటిరిగా? ఈ మొండికట్టియ వారి కెట్లుపచరించును?

మహా—నీవెప్పుడునూ అంతఃపురమున నిర్బంధింప బడిన దానవు. ఆగర్భశ్రీమంతురాలవు కావుననే నీకు లోక జ్ఞానము సున్న-అందుచే నత్యంతము బెదరి పోవుదువు. అప్పుడు ముందువెనుకల నరయజాలవు.

హాసీ—మా దృఢమైన ప్రేమయే మాకు దారిచూపును. పతిని గాక అన్యుల పరికింపమి మాకు పతియే దైవము. మగవారితో కలిసిమెలిసి తిరుగుటచే మతిచలించు నరాధా స్త్రీలము కాము.

మహా—ప్రేమ సర్వవ్యాపి, దానిపై నొక్క-జాతి వారికే హక్కు-కలదని తలపగూడదు- ఇది దాపుదృష్టి-విచ్చలవిడిగా సంచరించు హిందూభామలు తమపతులతో సహగమన మొనర్తురని నీవు వినలేదా?

హాసీ—నిజమే- యావజ్జీవ వియోగాగ్నిచే దహింపబడుటకన్న ఒకసారియే గుక్కెడు ప్రాణమును వదలుట సుకరము.

మహా—యావజ్జీవమూ బ్రహ్మచర్యవ్రతము నల్పు వితంతువులును వారియందే కలరు.

హాసీ—నే నేమి యుత్తరమిచ్చినను మీకు నచ్చుట లేదు-ఇం కొకటి చెప్పెద-శత్రువుల బారిని పడినతోడనే వారిలో నీచుడైన వరు నొకని నికా చేసుకొని కులము, శీలము,

మతమును గోత్రతోసి పునర్జన్మమున పూర్ణసంతోషము ననుభవింతును. ఇక తృప్తియైనదా?

మహా—ప్రేయసీ నీవు చపలవు కావున నీపనులు చంచలములు-ప్రసంగమున నగపడు చాంచల్యము కార్యఫణితి యందు కానరా నీయకుము.

హాసీ—నాథా, స్త్రీచిత్తము దుర్జ్ఞేయము, మాహృదయములు ఆకాశము సముద్రమువలె గభీరములు స్థిరములు; తలమెంతపరిక్షుభితమైనను దాని అడుగు శాంతస్వరూపమున వెల్గుచుండును. మిన్నున మేఘము లెంత ఘోరపరిణామముల నొందుచున్ననూ నక్షత్రమండలము శాంతిని బాయునా? నా హృదయతలముపై ఫేనమును చూచి మీరు మోసపోయితిరి, దాని యంతరంగ మెంత నిశ్చలమో, ఎంత గభీరమో, గుర్తింప నేరరైతిరి.

మహా—సమయము తటస్థించునప్పుడు సర్వమూ విశదమగును.

హాసీ—అట్టి తరుణమూ రావలదు, తథ్యమూ తేలవలదు.

మహా—సరే—నీకు కోపము వచ్చినట్లున్నది - ప్రియమైన వార్త నొకదానిని తెల్పెదను. నీపుట్టింటివారు నీకొక కానుక నంపిరి- చెప్పుకొను మదెట్టిదో.

హాసీ—నగలో, నాణెములో, దివ్యాంబరములో—

మహ——కాదు-అది సజీవ పదార్థము.

హాసీ——అట్లైన చెలికత్తె కాబోలు.

మహ——కాదు.

హాసీ——అట్లైన దాని లక్షణములు వివరించిచెప్పిన పోల్చుకొన గలనేమో.

మహ——అట్లే కానిమ్ము- కుక్కవలె కాపుండును, కోడిపుంజువలె బడాయి గొట్టును- చిలుకవలె మాటలాడును, చింబోతువలె గడ్డముండును

హాసీ——(ఆలోచించి) తెలిసినది మామంగలి గుల్ జారు కాబోలు.

మహ——చక్కగా గుర్తించితివి. నా డిప్పు డాన్నత్తి మాని యుద్ధభటుడై నాడట!

హాసీ——గుల్ జారు యోధుడయ్యెనా? జీలుగు చెట్టునకు చేవ కల్గినట్లున్నది. ఏడీ? రప్పించుము, చూతము.

మహ——అమీనా, గుల్జారు నిట రమ్మను. (ఆమెతో కూడ వాడు వచ్చును.)

హాసీ——ఏమి గుల్ జార్, ఈవేషము నెప్పటినుండి వేయుచుంటివి? వర్మము శిరస్త్రాణము శస్త్రములు నీకు భారములై తోపలేదా? నీవంటి పేలుడుగాయ పిరికిపంద యు నెచ్చటనైన నుండునా?

గుల్——నేను మీరెచిన్ననాటి తెరగుగా ఇప్పుడు లేను. నా వ్యవహారమంతయు మారినది.

హాసీ—నీ మీసమూ గడ్డమును బట్టి అట్లే యెంచ వలయును. రక్తము చిమ్మిన తోడనే గడగడ లాడేవాడవు.

గుల్—ఆలోపము అప్పటివృత్తితోనే తొలగిపోయి నది. తలలనుండి నేను చిమ్మించిన రక్తప్రవాహములను చూచిచూచి నాకన్నులు గడుసుపారినవి. ప్రేలుడుతనము కూడ యుద్ధవిషయము లందేకాని వేఱొక చోటలేదు.

హాసీ—యుద్ధభూమిని రక్తపాతము గనుట కవకాశ మింకను నీకు తటస్థింపలేదా?

గుల్—లేకేమి-ఒక పర్యాయము మంచి అవకాశమే చిక్కినది. నేను నామార్గమున బోవుచుండ నలువురు యోధు లొకమహూర్తమున నాపై బడిరి. అందులో నిద్దరి నొక దెబ్బతో నేల గూల్చితిని. మిగిలినవారిలో నొకడు నాతలపై నొకపట్టి పెట్టుటకు యత్నించెను గాని నే నతిప్రజ్ఞతో ఆ వేటు తప్పించుకొని వాని ప్రక్కలో కత్తితో పొడువగా అది వానికడుపులో దూచ్చి కొన బయటికివచ్చెను. నాల్గవవానికి నాప్రతాపము చవిజూప నెంచితిని గాని ఇంతలో మెలకువ వచ్చెను.

హాసీ—ఈప్రతాప మంతా కలలోని మాటయా? మేల్కొనియుండి నీవు యుద్ధము చేయనే లేదా?

గుల్—అట్టి అవకాశము చిక్కనిదే! నేను బిజాపూరు నుండి వచ్చుచుండగా మార్గమధ్యమున మావళా లొకటిరెండు సారు లెదురైరి, కాని ఆ యడవి మనుష్యులను చూచిన

తోడనే నా గుల్మము బెదరి వారు కనుచాటగువరకు ఆగినదే కాదు. అందుచే వారు ప్రాణములతో పోగల్గిరి. అట్లగుట మంచిదే-నా ప్రథమయుద్ధము శివాజీతో ప్రారంభించెదను. ఆతడు నాచేతిక్కినా ఒడలిపై స్పృహతప్పునట్లు నెత్తిపై నొక పట్టు పెట్టితీరెద. ఒకవేళ అతడు శరణుజొచ్చినవానిని మన్నించి నాహాలుకాన్కా-నౌకరుగా నియమింతును-అతడు చిక్కనవెన్క అందరులొంగక తీరదు. యుద్ధోత్సుక్య మనుతృణము నాకు హెచ్చుచున్నది. (కత్తిత్రిప్పును.)

హాసీ—ఆఁ ఆఁ. ఆగు మాగుము-శివాజీ అనుకొని మమ్ము కొట్టేవు!

గుల్—ఎంతకాలమని ఓపికపట్టుదును? నాకు విసుగు పుట్టుచున్నది. మరాఠాల రక్తము తాగవలెనని నాకత్తి నోరూరుచున్నది.

(తెరలో “హరహర మహాదేవ” అని కేకలు.)

మహ—అదే మరాఠాలు వచ్చినట్లున్నది. ప్రేయసీ, వారిని పారదోలి త్వరలో వచ్చెద. మనవారందఱు సిద్ధముగానున్నారు, నీవు కలవరబడకు. జయము మనకు నిశ్చయము-నే నిదే యుద్ధమునకు పోయెదను.

హాసీ—అయ్యో దైవమా, అనుకొన్నంత పనీ జరిగినదే. ఇక నాగతి యేమి?

మహ—నిన్నితడు జాగరూకతతో కాచుచుండును.

గుల్‌జార్-నా కీమెను సురక్షితముగా నప్పగించు పూచీ నీది సుమా.

హాసీ—వీని పరాక్రమమునందు నాకు నమ్మకము లేదు.

మహా—ప్రేయసీ-ఇప్పుడే వారిని చెదరగొట్టి నీచెంత జేరెద-అమీనా, నీ యజమానురాలి నొకక్షణమేని విడిచి యుండవలదు సుమా, ఏమరి యుండకుము.

అమీ—ప్రభూ-నీడ వస్తువును బాసి యుండుటెట్లు?

మహా—ప్రేయసీ-వీరిద్దరు నిన్ను కంటిని రెప్పలవలె గాచుచుందురు, కావున నీవు చింతదక్కి యుండుము-ఏదీ ప్రసన్నమగు దృష్టితో నన్నొకసారి చూడుము, పోలికలనుకు పోయెద. (ఆమె చూచును) సంతస మయ్యె, మీరు నిశ్చింతలై యుండుడు. (పోవును అమీనా గుల్‌జారు లంపకము పెట్టబోవుదురు).

హాసీ—ఏడ్పు వచ్చుచుండ దాని నదిమి స్మితవదన నైతిని? అయ్యో! ఆడజన్మ మాద్యంతము అసత్యవిడంబనము. ప్రియునిపై ప్రసన్నత యున్నయెడ అలక బూనుదుము. స్వార్థమును సాధించుపట్టుల అభిమాన ముట్టిపడునట్లు అభినయింతుము. పురుషుల కీబూటకముతో పనిలేదు. వారి మాటాచేయియు మీదు. లేని స్మితము, మేఘములేని వారిధారాపాతమును వారు తెచ్చిపెట్టుకొన నక్కరలేదు. ఆపద తటస్థించినతోడనే దాని తరింప వారుద్యుక్తు లగుదురు. మేమో? వారు తిరిగివచ్చునప్పటికి వారియెదుట

నేరనము ప్రదర్శింపవలయునో అద్దముచూచి అభ్యాసించు చుందుము.

(అమీనా వచ్చును.)

అమీనా—అల్ల కేమైన తగ్గనా ! ఇంతలో నా ప్రాణనాథుడు క్రమ్మర వచ్చునా?

అమీ—అదే ఎవరో వచ్చుచున్నట్లున్నది. చూచి వచ్చెదను (త్వరగావచ్చి) అమ్మా! మీరు లోనికి జనుడు, శత్రువులు వచ్చుచున్నారు, నేను వారిని పంపెదను (హసీనా తెరలోనికి పోవును.)

(ఆబాజీ శంభూజీలు వత్తురు).

శంభూ—ఇది రాణివాసము కాబోలు.

ఆబా—అటులే కానవచ్చుచున్నది.

గుల్—(వెనుకతగ్గి) వీరు మరాఠాలవలె నున్నారు, కాని మావళాలు కారు. ఇందు శివాజీ ఎవరో? వీరు నాఖడ్గమువాత పడుటకు యోగ్యులా?...వీరివద్ద శస్త్రము లున్నవి కావున కనికారము చూపదగదు! వీరిని నాచెంత చేరనీయక బల్లెముతోనో పిస్తోలుతోనో ఎగరగొట్టుట శ్రేయము. ఏమి నామూర్ఖత! బల్లెమును మరచితిని...(కత్తి నెత్తబోయి) ఏమిది నాచేతులు వడకుచున్నవి! చేతులే కాదు. ఒడలంతయు కంపమొందుచున్నది. సంబరముచేత కాబోలు, మీ రెవరు? ఆగుడు-ఈకత్తితో మిమ్ము ముక్కలుముక్కలు చేసెదను, గురి చూడనిండు, (ఆబాజీ శంభూజీలు ముందుకు

వత్తురు) అరే! ఏ రొకచోట నిలువరు. మరి గురిచూచు టెట్లు? ఏ రతిచంచలురు-తక్షణమే వీరిని నరికివైచెదను. దూరమునసున్న గురి అనును. దగ్గరపడినచో గురి చూచు టెట్లు? ఒకడున్నచో నొకకన్నుమూసి గురిచూడవలయు-ఇద్దరున్నారు కావున రెండుకన్నులూ మూసి చూచిన గురి సరిపోవును. రెండుకనులు మూసినచో నొక్కరైన కనబడరే! ఇప్పు డేమిచేయవలయు? ఇది నాకెవ్వరూ చెప్పలేదు.

ఆబా—వీడెవడో పగటివేషగానివలె నున్నాడు.

శంభూ—తురకల అంతఃపురములలో కొజ్జాలని యుందురు. వీ డట్టి నపుంసకుడేమో!

ఆబా—శస్త్రమును ధరించి సందడి చేయుచున్నాడు. ఓరీ పండా-నీ యజమానురా లెచ్చట నున్నది?

గుల్—నాపేరు గుల్‌జార్‌ఖాం. నా యజమానురాలు (గదివైపు చూచి) ఎచటనున్నదో నేనెరుగను.

శంభూ—సరే-నీవు చెప్ప నక్కరలేదు, కాని గోల చేయకు, అట్లు చేసితివా చూడు దీనిని. (పట్టాకత్తి చూపును)

గుల్—లేదు లేదు-మాటాడితే ఒట్టు.

శంభూ—అట్లుకాదు-నీకు పని కల్పించెదను-నీకాలి వేళ్ళు పట్టుకొని మేము వచ్చుదాక ఇట నిలువుము. మాటాడితివేని (కత్తిచూపుచు-అమీనా వచ్చును.)

ఆబా—ఇదే సుబేదారుకోడలు కాబోలు, లావణ్యా నందమున్నరాలే- అబానాహె బమితానంద భరితులగుదురు.

శంభూ—బాగుబాగు - మంచి బుద్ధిశాలులే. ఇది చక్కనిదేకాని జగన్మోహిని కాజాలదు- సుబేదారుగారి కోడలనుటకు దీనిమోముపై కులీనతాలక్షణ మొకటైన లేదు- ఇది ఆమెదాసి కావచ్చును. ఏమిరా కొజ్జా,నా మాట నిజమేనా? (వాడు తలయూచును) నా మాటయందు మీకు ప్రత్యయము కుదిరినదా?

ఆగా—నిజమే- ఈప్రశంస నాకేమీ తెలియదు.

శంభూ—నీ యజమానురాలు ఎక్కడ నున్నది?

అమీ—మీరు తోవతప్పితిరి. ఇది మహాలు కాదు- పరిచారిక లుండు తావు.

ఆగా—శంభూజీ! ఇక నిట మన మాలసింప నేల? వేరొకచోట వెతకుదము.

శంభూ—మీ కెంత అమాయికులు! ఈతొత్తు మాటను విశ్వసింతురా! ఏమే గయ్యాళీ, ఇది మహాలు కాదేమి? ఈశృంగారమంతయు సేవకుల కొఱకా? ఈ పందిరిపట్టెమంచము నీకొరకమర్చినదా? నీగడసుమాటలు నాయెదుట కట్టిపెట్టు-అబాజీ, లోని కేగుదము రండు.

అమీ—అయ్యా, బీబీగా రిచటలేరు- నమ్ముడు నామాట- అల్లా సాక్షి!

శంభూ—పోనీ- ఈ మహాలందము చూచెదము, నీవు కూడ మావెంట వచ్చి నీయజమానురాలిని చూపుము. ఆతెర తీయుము. (తెరతీయ హాసీనా మంచముపై నుండును,

అమీనా ఆమె చెంత కేగును.)

హాసీ—మీరెవలు, రాణివాసము జొచ్చుటకు హేతువేమి?

ఆబా—మిమ్ము గాంచుటకే మాగాక మీరు మా ఖైదీలు.

హాసీ—సరే. నే ననుకొనిన ట్లయినది. మాకు ఘోషాపద్ధతి యున్నదని మీరెరుగరా? దానిని మన్నింపక మీరిట్లు అంతఃపురమును చొరవచ్చునా?

ఆబా—అమ్మా- దేశము శాంతిసుఖము ననుభవించునపుడు సంప్రదాయము లన్నియు సాగును, యుద్ధసమయమున వాటి నుల్లఘింపక తీరదు. కాని మీ అభిజాత్యమున కనుగుణముగా అన్ని ఏర్పాటులు చేయబడును. అచిరకాలమున మిమ్మిటనుండి అన్యస్థలమునకు గొంపోదుము, కావున మీ రందుకు సిద్ధముగా నుండవలయును.

హాసీ—నే నిటనుండి కదలను. యుద్ధానంతరమున నన్నిట కలుసుకొందునని నా భర్త బాసజేసి యున్నారు.

ఆబా—గతమును మీ భర్తను మీరు మరువవలయును. యుద్ధము ముగిసి ఈదుర్గము మాకు స్వాధీనమయి చాలసేపైనది.

హాసీ—నన్ను మోసగింప మీ రిది కల్పించియుందురు, కాని నేను మోసపోవుదాననుగాను. నన్ను చేజిక్కించుకొని నానాథుని శరణాగతునిగ చేయవలెనని మీయూహ.

నే మన్నిదెబ్బల నభేద్య మగునట్లు ఏర్పాటులు చేసియుండ యుద్ధ మింతత్వరలో ముగియుననుట అసంగతము.

ఆబా—మరాఠీ సైనికుల హుటాహుటి నడకల మీ రెరుంగరు; మీసైనికులు హుకాలు లాగి వీచి శస్త్రముల నందుకొనునంతలో వారినందరిని యమపురికి పంపితిమి.

హాసీ—నానాథు డెచట నున్నాడు?

ఆబా—మీసైనికు లున్న చోటనే—

హాసీ—హా! దైవమా, ఇంత చేసితివా! (మూర్ఛిల్లును)

శంభూ—అయ్యా, మీరు ప్రజ్ఞావంతులే కాని స్త్రీలతో నెట్లు మసలుకోవలెనో మీకు తెలియదు. వీరు పుష్పముల నంటివారు, అట్టివారిపై అగ్నికణములు వేసితిరి. ఆహా! ఏమి సౌందర్యము. ఈమె సుఖమునకై ఎట్టి రమణీయ వస్తుచయము సమర్చియున్నారు! అవన్నియు నీమె లావణ్యమునుజూచి వెలవెల బారుచ నున్నవి. ఈధూపసామగ్రి యీమెఉచ్ఛ్వాసనిశ్వాసగంధమున రూపరినది. ఈచామరము లీమె శిరోజముల మార్దవమునకు పోడపునకును భ్రమించి నిశ్చేష్టితము లైనవి. ఈ స్ఫటిక కాంతికన్న ఈమె శరీరకాంతి శుభ్రతరముగా నున్నది. ఈపుష్పహారము లీమె బాహువులకన్న కఠినతరములగుట గవాక్షములగుండా పారిపోవ నుద్యమించుచున్నవి. నవనీతకోమలమగు నీమె తనూలత హంసతూలికాతల్పముకన్న మృదుతరమైన దనవచ్చును.

మండలేశ్వరులమధ్య సార్వభౌమునివలె చుక్కలలో చంద్రుని వలెను ఈ వస్తుచయముమధ్య నీమె సౌందర్యము విలసిల్లుచున్నది.... ఈమె నేకాంతమున శివబా చూచెనా మోహావాగురుల చిక్కకపోడు. పరాక్రమమున్నచోట విష యాసక్తి ఉండితీరును. యుద్ధరంగమున అగ్రిహోయత్తులగు వీరులను జయింపనుత్సహించు జగీషయే విలాసమందిరమున హాతాయత్తులగు నారులను వశపరచుకొన నుత్సహించును. శివబా నపుంసకుడు కాకుండెనేని ఈమెను మోహించి తీరును. ఇట్లు అపురూపసుందరియగు రమణిని పొందగోరని వాడు రణరంగమున జయమునొంద నర్హుడుకాడు. ఇట్లు సౌందర్యశ్రీ బాహులతె కంఠమున దాల్చనెంచని వీరుడు విజయశ్రీహారమును దాల్చుటకు పాత్రుడు కాడు. శివబా విధించిన ఆజ్ఞను సరకుసేయక ఈమెను నాయంతఃపురమును చేర్చియుందును, కాని సంస్కృతమున ఈమెను సాధ్యముగా జేయక సాధనముగా నుపయోగించుటయే శ్రేయము. అట్లొ నర్చుటచే నాకు కలుగనున్న లాభమెక్కువ రత్నవర్తకు డంగడిలోని రత్నమును ఒరులకుగూర్చ భద్రపరుచురీతి నీమె కెట్టి అవమానమును ఘటింపనీయక తగిన తరుణము వచ్చున రకు కాపాడుచుండెదను... ఆబాజీ! అట్లు తెల్లపోయి చూచె దవేల? ఈమె శివబాకు స్పర్శక్షమమగు రత్నమగును గాని మనబోంట్ల కంట రాని అగ్నిశిఖచుడీ!

ఆబా—శంభూజీ! నివుచేయు ప్రసంగము విని విస్న

బడుచున్నాను. ఇవేటి మాటలు! ఈమె అబాసాహేబునకు దాసి కావున మనకు తల్లివలె పరమపూజ్యురాలు.

శంభూ—నేనన్నదదియే. ఈమెనొక పల్లకినెక్కించి ఏకాంతమగుచోటికి కొంపోవుదము, రేపు శివబా ఈ మేడలో దిగును, అప్పుడు మనయాటలు సాగిరావు.

ఆబా—అట్లేచేయుదము కాని ఈప్రక్రియకు ఉత్తర వాదములుమీరే.

శంభూ—అదేమి? మీరు దిగులు పడుచుంటిరా?

ఆబా—ఈమె సాధారణస్త్రీయు ఆబాసాహెబు సామాన్య పురుషుడునైనచో నేను నిర్భికుడనై యుండును; ఈమె అసామాన్య సౌందర్యవతి, ఆత డలౌకికాంతర్నిగ్రహము కలవాడు; వీరి అన్యోన్యసందర్శన మెట్లుపరిణమించునో భావింపలేక భ్రాంతుడ నగుచున్నాను.

శంభూ—పరిణమించుట కేమున్నది? సౌందర్యవతిని సందర్శించిన సరసునిరీతి శివబా ఈమెవలలో చిక్కును, ఒక సారి నీతిభ్రష్టుడయ్యెనా తనచేతిక్రింది అధికారులు తబ్బిబ్బుగ జూతురు, ప్రకృతము నాతడున్న తాదర్శ్యాకాశమున నుండుటచే పృథ్వియందలి సామాన్యుల చిత్తవికారము, విపరీత చర్యలును వానికగోచరములైనవి; ఈ యప్సర వాని నవనీ తలమునకు దిగలాగును. అప్పుడు జనసామాన్యాచరణ మాతని కవగత మగును, కావున రణరంగమున సమరకేళి యథావిధిగా జయప్రదముగా సల్పిన వీరుల మనోభావముల

నాచరణరూపమున పరిణమింపజేయ వారిని గొంతవరకు నిచ్ఛావిడిగా విహరింపనిచ్చుట యోగ్యమని వానిమనసునకు తట్టును; ఈసుబేదారుపై మీకున్నకసి మీరు తీర్చుకొన వచ్చును.

ఆబా—అట్టి తరుణము లభింపవలయుననియే కదా ఇట్టి యుపద్రవము కొనితెచ్చికొంటిని! ఇందు కృతకృత్యుడ నైతినా మేలే, లేకున్న మెడ కురి తప్పదు.

శంభూ—లాభము గొప్పదైనచో ధోక్యము కూడ గొప్పది కావలయును. ఇది లేకున్న దానివలన సమకూరు లాభ మంత హర్షదాయకము కానేరదు. ఇక నీమెను స్థలాంతరమును చేర్ప నుద్యమించి రేపు పెందలకడ యోగక్షేమ ములనారయ బొంకు- ఇనుము తప్తమై యున్నప్పుడే దానిని సమ్మెటలతో సాగగొట్టి మనముకోరినరీతిని దాని కాకారము నియమింప వచ్చును, అట్లే హతాశాతప్తయగు నీమె మానసమును మీ కనుకూలమగు తీరున మార్చుట కిదే తరుణము. అవకాశ మెంతయో లేదు- రేపు శివబా వచ్చినప్పటినుండియు మీ కాతనిచెంత నుండవలయును.

ఆబా—ఈపని నిర్వహించుటకు మీరు యోగ్యతరులని నా అభిప్రాయము.

శంభూ—ఎంతమాట! మీ రుపక్రమించి చూడుడు, విఫలమనోరథు లైనచో నేను తప్పక సాయపడెదను. ఇప్పటి మట్టుకు నన్ను తెరమరుగుననే నిల్వనింకు. రేపంతయు నాకు

తీరుబడి కావున చతురుపాయముల నామె మనస్సు తిప్పె దను- పోవుదము రండు...(బయటికి వచ్చి) ఏమిరా? నియమితస్థలము వీడి నీవెందును పోలేదు కద?

గుల్—సమయము నాది కాకుండా పోయినది దేవరా!

శంభూ—నీవంటి మూత్రప్రాయునకు వంగియుండుట ఆవశ్యమూ అబ్బియుండవలయు. వర్మశస్త్రముల భారము లేకపోయిన నీ వింత యలసియుండవు, కావున ఇకముందు నీవు వాటిని ధరింపకు. ఇంకను కాలి వేళ్ళను విడువవేల? ఇదిగో నేను చెప్పునది జాగ్రత్తగా వినుము. నీయజమానురాలికొరకు పల్లకి వచ్చును. ఆమె వెంట నీవును ఆతోత్తు కూడ రావలెను. ఇట్లు జరుగకున్న ఈఖడ్గమును జూచితివా? జాగ్రత్త!

గుల్—అమ్మయో! చచ్చితిని! (నేల పడును, ఆబాజీ శంభూజీలు పోవుదురు).

అమీ—అమ్మగారికి స్పృహ వచ్చినట్లున్నది. ఇట నుండి బయటికి పోవుటకు వీలుండునేమో చూచెదను. గుల్ జార్ ఖాం! (పోయి చూచి) వారీతని చంపిపోలేదు కదా?

గుల్—వారిక్కడలేరు-నేను గనినది కల కాబోలు. అమీనా! ఎట్టి కల గంటినే! జాగ్రత్స్వప్నావస్థలయందలి వ్యవహారములకు పరస్పరవిరోధ ముండునందురు, అది నిజమే సుమా. ఇద్దరు మరాఠావీరులు నన్ను హతవీర్యునిచేసి నా చేత నాకాళ్ళు పట్టించినట్లు కలగంటిని.

అమీ.—మీ పాదములే కదా! ఇంకొకరివి కావే! ఒకరికి మీరు మొక్క లేదుకదా?

గుల్—కలలోనైన అంత నైచ్యమున కొడిగట్టుదు ననుకొందువా? నామాటయందు నీకు నమ్మకము లేదా?

అమీ.—నమ్మకము లేకేమి! మీరు కన్నకల నేనూ కన్నాను. ఆ మహాత్ములు మొట్టమొదట కొంతఆర్భాటము చూపి పిమ్మట వారు దిగులుగొల్పగా మీరు మెత్తబడిరి. అనంతరము వారియాజ్ఞచే కాలివేళ్లను పట్టుకొని నిల్చియుండిరి; నోటితో చెప్పలేక సంజ్ఞచేసి అమ్మగారు లోపలనున్నారని చెప్పితిరి. మనస్వప్నము లచ్చముగా ఒకదాని నొకటి పోలియున్నవా?

గుల్—ఇదంతయు జాగ్రదవస్థయందే జరిగినదనియా నీ అభిప్రాయము? ఈశస్త్రములన్నియూ నాయొద్ద నుండగనే?

అమీ—శస్త్రములను గోడకు తగుల్చుటయందును మీచేతి కిచ్చుటయందును భేద మావంతయు లేదు. మీ హస్తలాఘవము నిదివరకే ప్రదర్శించితిరి, ఇక పదలాఘవము చూపుతరి వచ్చెను. ఇటనుండి మనము తరలవలయు. ఈ వేషమంతయు వీడి ఒకకత్తి మాత్రము చేతనుంచి బయలు దేరవలయు. అది మీ కుపయోగపడకున్న పరులకైన నుపయోగించును.

గుల్—అయ్యో! నా కెంత యధఃపతనము వాటిల్లెను!

అమీ——ఒకప్పు డాస్వాత్యా మబ్బియుండినకదా నే డధఃపతనము వాటిల్లడము!

గుల్——ఇదంతయు స్వప్నమైనచో ఎంత బాగుగ నుండును.

అమీ——కోరికల కేమి ? త్వరగా నాయత్తపడుము. అమ్మగారిని నేను కొనివచ్చెదను.

గుల్——ఇక్కడ జరిగినదంతయు ఆమెతో చెప్పెదవు సుమా !

అమీ——మీప్రవర్తనయే దానిని ప్రత్యక్షీకరించును. (పోవును).

గుల్——పాఠశాలలోని శిక్షకూ ప్రపంచమందలి వ్యవహారమునకును ఇంచుకేని సంబంధము లేదు. నేను యుద్ధశాస్త్రమున నిపుణుడనై గురువులచేత నెంతయో శ్లాఘింపబడి, ఏ సైనికపాఠశాలయందునూ శిక్షనొందని మరాఠాలను చూచినతోడనే భ్రమాస్పదితిని. హస్తలాఘవమంతయూ కాలివ్రేళ్ళను బట్టుకొనుటకువచరించెను. మంగలి కత్తితో తీయగలిగినంత రక్తమైనా, పట్టాకత్తితో తీయలేనైతిని. "హరహర మహాదేవ" అను కేక వినబడినతోడనే అంతస్సారశూన్యుడనై మృతప్రాయుడనైతినా ?

(అమీనాచేయి పట్టుకొని హసీనా వచ్చును.)

హసీ——అమీనా, అడుగు ముందుపడకున్నది. నానాథుడు రణరంగమున శయనించెనని వినినప్పటినుండియు నా

కీళ్ళన్నియునూ జారినవి.

అమీ—అమ్మా! మరాటులు పెనుజిత్తులమారులు, వారి మాటల విశ్వసించి మీరు దిగులువడకుడు. ఈ నడి రేయిని గాఢాంధకారమున ఈ మూర్ఖులు మనప్రభువుగారి జాడ కనిపెట్టిరా? అసంభవము. యజమానిగారు సురక్షిత ముగా నున్నారు. వలసగామి ఏచోటనో దాగియుందురు, అచిరకాలమున మనల చూడవత్తురు, నామాట నిజము.

హసీ—నీమాటలు నాకు ప్రాణము పోసినవి. నీవు చెప్పినచొప్పున నానాథునితో పునస్సమాగమము కల్గినచో నాకన్న ధన్యరా లుండబోదు. అంత అదృష్టము నాకు కలు గునా? పోనీ, నాకంట బడకున్ననూ ఎందేని సజీవులై యుం డిన చాలును.

అమీ—అమ్మా! త్వరగా ముందునడువుము.

హసీ—గుల్‌జార్-ఇంతదాక నిన్ను పరిహసించినందుకు నేనే చింతిలుచున్నాను. న న్నిటనుండి సురక్షితముగా తప్పిం చితివేని శాశ్వత ఋణస్థురాల నగుదును. త్వరగా అడుగు వేయుము.

గుల్—ఎంత చిమ్మచీకటిగా నున్నదో కంటిరా! ముం దడుగు పడుటెట్లు?

అమీ—మగవాడవు, నీవే చీకటికి భయపడుచుం టివా? నడువు.

గుల్—భయమనికాదు-విచ్చుకత్తితో చీకటిలో

నడువ అది ఎవరికైన తగిలినచో నిష్కారణహత్య జరుగును గదా అని సందేహించుచున్నాను.

అమీ—ఈ గ బిజ యొనదిమొదలు మీ కితరుల ప్రాణములను గూర్చినచింత ఎక్కు వయినట్లున్నది.

గుల్—ప్రాణము లెంతతీపియో ఇప్పుడు తెలిసినది. ఇదిగో ముందడుగు వేసితిని.

(సట్వాజి ఎదురగును)

సట్వా—ఆగుడు-ఇటనుండి ఎవరునూ బయటికి పోగూడదు.

గుల్—మేము వెళ్ళితీరుదుము- మ మ్మాటంకపరచు వా రెవరు ! (వెన్కకు తగ్గును.)

సట్వా—ఏమి నీపొగరు! చూడు నా దెబ్బగుచి (కత్తెత్తును)

గుల్—(కత్తిపారవైచి) నిరస్త్రునిపై కత్తినెత్తుదువా? ఇదియా మీ మరాఠా పౌరుషము ? భళిరే మగవాడవే—

సట్వా—ఇడుగో నేనూ కత్తిని పారవైచెద. మల్లయుద్ధము చేయుదము రమ్ము.

గుల్—ఇందాకటినుండి నానడుము నొప్పిగానున్నదని పెట్టి మల్లయుద్ధమునకు పిలిచెదవా? పౌరుషహీనుడా! నాశరీరమే స్వస్థమైనచో నీబింకము చూచియుందును;

సట్వా—పోనీ, మేలైనదలే. ఇదిగో పల్లకి వచ్చినది,

సీతో మాటలాడుటకు నాకు తీరుబడిలేదు. అమ్మగారూ, ఈపల్లకిలో కూర్చుండుడు. మీరుభయులూ పల్లకితో నడు వుడు. నేను మీవెంట నుండెదను—(పోవుదురు)

---

## —•నాల్గవ రంగము•—

---

ఆబాజీసోన్ దేవు—సట్వాజీ

ఆబా—కోటలోని ఏర్పాటులన్నియు చక్కబరచి నే చిన్నదానిని కలుసుకొనుటకు వచ్చితిని గాని నాహృదయము తల్లడిల్లుచున్నది. ఆచిన్నది దుఃఖముచే దురపిల్లుచుండును. శంభూజీ చెప్పినట్లు నేనిప్పుడీమెతో ప్రసంగింపనెంచుట గోరుచుట్టుపై రోకటిపోటువలె నుండును కదా? తొలుత నామాట నామె అంగీకరింపదు, రూఢమే. అట్టియెడ నామెను కఠినోక్తులాడుటకు నాకు నోరెట్లు వచ్చును? దీనురాలైన అబలను పరుషవాక్యములాడి నొప్పించుట క్షత్రధర్మము కాక మనుష్యధర్మముకూడ కాదు అను ఆబాజీమాట అసత్యముకాదు. సరే-వచ్చితిని కావున ఆవేళకు తోచినట్లామెతో ప్రసంగించి వచ్చెదను. అవకాశ మానన్నమగునప్పుడు అదియే ధైర్యముగొల్పును. సట్వాజీ, బీబీగారు రాత్రియంతయు దుఃఖముతోడనే గడిపిరా?

సట్వా—సందడి ఏమియు లేనందున నిద్రపట్టినదియే నాయూహ.

ఆబా— ఈమె శరీరము కుసుమముకన్న మృదువై నను హృదయము వజ్రముకన్న కఠోరమని యెంచవలయును సరే-ఈమె స్థితి నా కనుకూలించునేమో ! ఆ పారాజవా నెట్లున్నాడు ?

సట్వా— ఇంతవఱకూ నిద్రించి యిప్పుడే మేల్కొన్నాడు. నిద్రలో "మరాఠాలను కట్టూకొట్టూ" అని ఒకటే పలవరింత !

ఆబా— వాని సుఖస్వప్నమునకు మనము భంగము కల్గింపనేల? తురకలు మాకు పగలు లొంగియున్నచో మేము వారి స్వప్నములలో నిన్నిసారులైన చావసిద్ధముగానున్నాము

సట్వా— ఇటే వచ్చుచున్నాడు.

ఆబా— కొజ్జాబహదూర్ గారూ, కొంచెమైన భంగములేక నిద్రపట్టినదా ?

గుల్‌— మీదయవలన గాఢనిద్ర లభించెను. ప్రభువువారు నన్ను నిరశాస్త్రిని చేసి నాభారము తగ్గించితిరి. అందుననే నిద్రపట్టినది.

ఆభా— జాగ్రదవస్థయందు మేము తీయించిన అస్త్రములనన్నిటిని విరాగ స్వప్నమున ధరించు మమ్ము గద్దించుచుండెడి వారట ?

గుల్— కిట్టనివా రెవరో నాపై నీనింద మోపియుండవచ్చును. ఎఱుకలేమిచే అట్లనియుంటినేమో— క్షమింపుడు

అబా—వెరువకు. స్వప్నములో రాజద్రోహమొన ర్చుటకు మీకు సంపూర్ణస్వాతంత్ర్య మున్నది-మీ యజమా నురాలు మేల్కొన్నదా?

గుల్—వా రింతకుముందే లేచి స్నానమాడి సిద్ధ ముగా నున్నారు.

అబా—అట్లయిన మేను వచ్చియున్నానని వారి కెరిగింపుము-తగిన సమయముననే వచ్చితిని-కార్యము కాయ అగునో లేక పండగునో?

(పోవును)

---

—• అయిదవ రంగము •—

---

(హసీనా, అమీనా, గుల్ జార్)

హసీ—గుల్ జార్, నేను సిద్ధముగా నున్నానని వారికి తెల్పుము. (గుల్॥ పోవును) అమీనా, ఆ మరాఠా సర్దా రింత పెందలకడ ఏయుద్దేశముతో వచ్చియుండును? నాకోర్కె సిద్ధించుట కీశ్వరు డాయన నిటకు బంపియుండునా?

అమీ—అమ్మా, తినబోవుచూ రుచి యడుగనేల? వారే వచ్చియున్నారు కదా, అంతయు విదితమగును.(ఆబాజీ వచ్చును)

హసీ—దయచేయుడు సర్దారుగారూ-నేను తమ కొరకు నిరీక్షించుచున్నాను. ఇతరులయెడ ఘోషా అవలం

బింతును, కాని నిన్న మిమ్ము చూచినప్పటినుండీ మిమ్ము విశ్వసింపవచ్చునని నాకు తోచినది.

ఆబా——మీరు నాకు మాతృతుల్యలు; నిరభ్యంతరముగ నన్ను విశ్వసింపుడు; అందుకు నేను యోగ్యుడనని మీకే విశదము కాగలదు.

హాసీ——నా ప్రాణనాథు డెట నున్నాడో తెల్పుడు.

ఆబా——వారు స్వస్థులుగ యున్నారు, ఎట నున్నారో మాత్రము చెప్పజాలను.

హాసీ——తల్లిదండ్రుల నెడబాపుట తగునా?

ఆబా——అట్లు చేయ తగునా?

హాసీ——మమ్ము కలుపుట కిట్లు జాగుసేయు నేల?

ఆబా——వారిని మీ రీలోకమున గాంచజాలరు.

హాసీ——పరలోకముననా మమ్ము మీరు కలుపనెంచినది? సరే, మా అవశిష్టము లేదు. ఒక్కసారియే మమ్మిద్దర జంపి పరలోకమున కంపుడు, మమ్ము కలిపిన చాలును. మమ్మెడబాపుటచే మీకుగల లాభమేమి?

ఆబా——లాభమే లేకున్న దంపతుల నెడబాపుదురా?

హాసీ——ఎట్టి లాభము? కళ్యాణప్రాంతము మీకు చిక్కినది, మందుగుండుకొట్లు, ద్రవ్యాగారములూ, వస్త్రాభరణములు మొదలగునవి మీ వశమైనవి. ఇందలి నిధినిక్షేపములూ రహస్యమార్గములును మీకు తెల్పెదము.

ఆబా——మీ రిప్పుడు చెప్పినవాటితో మాకు ప్రయో జనము లేదు.

హసీ——ఇక మీకు కావలసిన దేమి? ఇక ముందెన్న డేని మావారు పోరగలరని మీకు సంశయము కలదా? అటు లెన్నడును తలంపకుడు. వారు శాంతిపరులు, సంతుష్టస్వాం తులు; నా ప్రాణనాథునకు నా మహాలే సర్వప్రపంచము, మాప్రణయకలహాములే వారి యుద్ధములు, మా సంధాన ములే వారి యభిసంధి-ఇం దసత్యమన్నది లేదు. కావలయు నన్న ఇటుపిమ్మట రాచకార్యములలో నెట్టిజోక్యమూ కలుగ జేసుకొననని వారిచే మీకు పత్ర మిప్పించెదను. మాకు రాజ్య మక్కరలేదు, వైభవముతో పనిలేదు, ద్రవ్యము దాసీజనమును వలదు. మమ్మిద్దర స్వేచ్ఛగా నుండనిచ్చిన చాలును-ఏ యరణ్యముననో కుటీరమును కట్టుకొని కలియో గంజియో తాగుచూ కాలక్షేపము చేయుదుము. అదే మాకు రాజభోగ మనిపించును.

ఆబా——బీబీగారూ, మహమ్మదీయులు హిందువు లను జయించునప్పుడు వారు మీ రిప్పుడు చెప్పినవాటినే అపేక్షించిరా? తిరిగీ రాజకార్యములలో జోక్యము కలుగజే సుకొనమను ఆశ్వాసనము వారికి తృప్తిగొల్పెనా? రాజ్యముల విడి అడవులకు బోవుదుమని వేడుకొనిన మావారిని మీవా రూరక విడిచిరా? లేదు-వారి ఆసురవాసన కట్టి వ్యవహారము పోనగలేదు. ఒకచేత ఖడ్గము వేరొకచేత కురాన్ ధరించి

బలాత్కారముగా మూవారి ననేకుల భ్రష్టధర్ముల కావింపక వారి కన్నులు చల్లనాయెనా, కడుపులు నిండెనా?

హాసీ—సరే-మీరునూ మమ్ము బలాత్కరించి హిందూమతమును స్వీకరింపచేయదలచినచో మేమందుకూ సిద్ధపడి యున్నాము-నాభర్త ఉదారస్వభావులు కావున వారి కన్ని మతములందును సమానగౌరవము కలదు. నాకు నా పతియే దైవము, వారి ధర్మమే, నా ధర్మము. మీ వస్త్రాభరణముల ధరించవలెనన్న నాకు ముచ్చట, మీ కుంకుము బొట్టుయెడ నా కమితాదరము. దానికొరకేని నేను హిందువు నయ్యెదను.

ఆబా—తురకల దుష్కృత్యములు జాబితా ఇంకను ముగియలేదు. మా దేవతావిగ్రహముల పగులగొట్టిరి, దేవాలయముల మట్టిలో కల్పి, ఆయాచోటుల మసీదులను గట్టిరి. మతమును మాపుదుమను మిష పెట్టి మాకళలను ధ్వంసము చేసిరి, మాగ్రంథములను తగులబెట్టిరి. మాయిళ్ళను పరశురామప్రీతిచేసిరి, మమ్ముల తగనిబాధల పాలు చేసిరి, మా ముఖములయందు వాతలువేసిరి. చెవులకు బూరిద తోపరాలు కట్టి మిరపకాయల పొగ వేసిరి, కాలుచున్న పెనములపై మమ్ము దొర్లించిరి, బ్రతికియుండ మాచర్మములు నొలిపించిరి! మరియూ—

హాసీ—ఇక చాలును. అయ్యో! నే విననేరను.

ఆబా—వినుటకు కూడ ఘోరములగు బాధల

మావా రెట్లనుభవించిరో ఇంచుక యోచింపుడు. దీనికేమి, మరికొన్ని వేడుకల వినుడు. మాకుటుంబములలోని స్త్రీపురుషుల నడిబజారున గానిసలగా నమ్మిరి. నాలుగుగోడలమధ్య ఏ పోరును లేక గౌరవముతో బ్రతుకుచుండు కుటుంబముల చెడరగొట్టి పురుషుల యెదుట వారిస్త్రీల బలవంతముగా నవమానించిరి.

హాసీ—మీరు వీటిని వేడుక లందురా?

ఆబా—అట్టి దౌర్జన్యతత్పరుల కవి వేడుకలు కాకుండునా?

హాసీ—ఇంచుకేని హృదయముకలవారును మానుష స్వభావులు నైనవా రిట్టి ఆగడముల మెచ్చుకొనరు. ఇట్టి చర్యల నేనుతిమును ప్రశంసింపదు.

ఆబా—నే నీఅకార్యముల నింత వివరముగా వర్ణించుటకు తగినంత కారణమున్నది. ఇట్టి దుర్ఘటముల పాల నా గ్రామస్థులు, నా మిత్రులు, బంధువులు, నా పూర్వపురుషులును పడిరి. ఆబాధలన్నియును నామనమున ములుకులవలె నాటిపగదీర్చుకొమ్మని నన్నడతెగక ప్రేరేపించుచున్నవి. అట్టిచో నా కీసమయమున చిత్తశాంతి అలవడుటెట్లు?

హాసీ—అయ్యో! ఈకథ వినినతోడనే నా మాంసమంతయు నీరై నా కన్నులగుండా ప్రవహింప నున్నది. చెప్పునపుడు మీరునూ వినునపుడు నేనునూ సమాన దుఃఖుల మగుట ఒకరి నొక రోదార్చుకొందము.

ఆభా——అట్లు కానేరదు. అట్టి దౌర్జన్యములకు కారకులు మీ మామగారి పూర్వపురుషులే.

హసీ——వారి దౌర్జన్యములకు తగినట్లు మీరు మా యెడ దౌర్జన్యము చేయ తలపెట్టితిరా. పూజనీయులగు మా మామగారికి మిరపకాయలపొగ వేయుదురా? నాపతిని కాలినపెనముపై కాలిడుదురా? నేను బ్రదికియుండ నా చర్మము వలిచెదరా?

ఆభా——చర్మము వొలచుటంతనే మానవునికి బదులెట్లగును?

హసీ——మొదట మాతృకల్పనని మన్నించి నన్ను మీరు రవమానింతురా?

ఆభా——అట్లు కాదు. నాకు పితృకల్పుడగు నొక వ్యక్తికి కానుకగా నొసంగెదను.

హసీ——నేను మాతృకల్పను కావున నాపతి మీకు పితృతుల్యులు, వారికి నన్ను కానుకగా నొసంగుడు. వలదనునెడ నన్నొక పెట్టెలో బెట్టి మిఠాయి అనిచెప్పి నాప్రాణేశ్వరుని ముందల నన్ను జేర్పుడు.

ఆభా——నా కీజగతిని పితృతుల్యు లొకరే గలరు-మహాప్రతాపశాలులగు ఛత్రపతి శివాజీ మహారాజుగారు.

హసీ——వారికా మీరు నన్ను కానుకగా నొసంగ దలచినారు?

ఆబా——మీరు సంతోసముతో ననుమతించిన అట్లే చేయుదును.

హాసీ——నాపతి జీవించియుండ నేను శివాజీకి స్వాధీన నగుదునా? ఇదియా మీకు నచ్చిన వేడుక? నాపతిని వీడి నేను శివాజీకి దాసి నగుటయా? అట్లే చేయగల్గినచో శివాజీ ప్రతాపశాలి యనవచ్చును...సర్దారుగారూ, మీయుద్ధకౌశలము నేనెరుంగను గాని మీవాక్చాతుర్యమును బట్టిచూడ మీరు పిదూషకపదవికి తగియున్నా రనుట నిశ్చయము.

ఆబా——ఏమంటివి?

హాసీ——మీరు నన్నేమిచేయుదు నంటిరి? కానుకగా నిచ్చుటకు మీరూ, పుచ్చుకొనుటకు మీరాజుగారూ, సిద్ధపడుదురే కాని నా సంగతి నించుక ఆలోచించితిరా? పురుషులు మాత్రమే నీతిమంతు లనియూ మీయూహ? స్త్రీలు నీతిదూరులని యెంచితిరా?"అంగడిలో బెల్లము గుళ్లో లింగానికి నైవేద్యము"న్నట్లు పరస్త్రీని యజమానికి కానుకగా నొసగునంత ఉజ్వలస్వామిభక్తి మీకుండ, నాప్రాణేశ్వరుని మదిలోనెంచి ఫాలాక్షునేని గొప్పగా నెన్నకుండునంత పతిభక్తి నా కుండకూడదా? నేను విజాతీయ వనితనని అట్లు భావించుచుంటిరా? పోనీ మీ జాతిలోనిస్త్రీ అట్లు చేయుటకు సమ్మతించునా? మీవా రట్లుచేయకున్న మేము మాత్ర మట్లంగీకరింతుమని మీరెట్లూహింప గల్గితిరి? గొప్పకులములో పుట్టి గొప్పనేనల గొట్టి గొప్పపదవుల మెట్టిన మీ

బోంట్ల కిట్టి స్వల్పవిషయము ఎరుకపడకుండునా?

ఆబా——నా మాటవిని సంతాపభరమున మీ రొడలు మరచినందున మీకిట్లు తట్టుచున్నదేమో గాని సావకాశముగా మీ రాలోచించినచో దీనివల్ల మీకు కలుగనున్న మేలు స్ఫురింపకపోదు.

హసీ——రానున్న మేలుమాట అటుంచి పోనున్న మానము, కులశీలములకు కలుగనున్న కళంకము, తన్మూలమున సంభవింపనున్న అధఃపతనమును ఇంచుక భావించితిరా? నీతి-అవినీతియు అవస్థాభేదమున మారునా? అయ్యో, దైవమా! ఎంత లజ్జాకరమైన అవస్థ ఘటిల్ల జేసితివి! ఈమాటలు వినుచున్న నాగుండె బద్దలుగా దేమి? (అమీనాపై తలపెట్టి నిర్ఘాతపడి పోలును) నాకు మరణము రాదేమి? హా! దైవమా! (మూర్ఛిల్లును).

ఆబా——ఇక నిట నుండరాదు. నిరాశాహతురాలై ఈమె ఆత్మహత్య చేసుకొనునేమో? దాని గూర్చి తగిన ఏర్పాటు లొనర్పవలయును. (పోవును).

---

——ఆరవ రంగము——

---

ఆబాజీ, గుల్‌జార్.

ఆబా——ఓరీ, నీ యజమానురాలిని శివాజీమహారాజు గారికి కానుకగా నర్పింపవలయునని నా కుద్దేశ మున్నది. నీ వేమందువు?

గుల్—ఈయాలోచన నా కంతబాగుగా నున్నట్లు తోచదు.

ఆబా—ఏల ?

గుల్—ఆలోచించుట కవకాశము వలదా ?

ఆబా—కష్టసమయమున గాని అలోచనాశక్తికి తీవ్రత ఘటిల్లదు. నీ ప్రాణముమీదకి వచ్చినకాని నీబుద్ధికి చురుకు పుట్టదు. (కత్తిచూపి) నామాట కంగీకరింతువా? లేదా?

గుల్—అంగీకరించితిని- బాబ్జీ-అంగీకరించితిని.

ఆబా—అది యోగ్యమైన పని యందువా?

గుల్—మీరు కత్తిచూపునప్పుడే దానియోగ్యత నాకు తట్టినది.

ఆబా—నీ బుద్ధిసూక్ష్మతకు సంతసించితిని.

గుల్—ఇదంతయు మీ కత్తిప్రభావము.

ఆబా—ఇందు న్యూనత కలదా ?

గుల్—అబ్బే! న్యూన తేదీ ? మాయజమానిగారు నాతో "నీ యజమానురాలిని సురక్షితముగా నా కొప్పగింప వలెను సుమా" అని నాతో చెప్పిపోయిరి. మీకోర్కె నెర వేరినచో అమె క్షేమమునకు భంగము వాటిల్లదు. నాకు కావలసిన దంతే.

ఆబా—రవ్వంతయు లోప ముండదు. కాని నే నీమాట ఆమెతో చెప్పినతోడనే పొరవిడిచిన నల్లతాచువలె నామె నాపై కెగిరి బుసగొట్టినది. ఆ కోపముచేతనూ పతి

వియోగసంతాపముచేతనూ ఆమె ఆత్మహత్య చేసుకొనునేమో అని అనుమానము కలుగుచున్నది. ఆమె అటులొనర్చెనా నీ యజమానికి నీవు ఉత్తరవాదివి కాగలవు. ఆత డొకవేళ నిన్ను మన్నించినను మేము మాత్రము నీచర్మ మొలిచి తీసెదము.

గుల్—ఆమె ఆత్మహత్య చేసుకొనినచో ఆమె శరీరమునకు బదులు నాశరీరమును మీ రాజుగారి కర్పించుదు.

ఆబా—చిల్లిగవ్వ చేయని నీశరీరము మాకేల ? ఆమె మృతిచెందినచో నీకు మృతి తప్పదు. తెలిసినదా ! (కత్తి చూపును).

గుల్—తెలిసినది- తెలిసినది. నన్నేమి చేయుమందురు ?

ఆబా—తెలిసినదంటివే ? మూర్ఖా !... ఇటువినుపైనుండి తాడుగాని విషముగానీ లోనికి పోగూడదు. ఆమె దగ్గర వజ్రాభరణము లేమియూ లేవు. శస్త్రమున్నచో నీవు దానిని సంగ్రహింపవలయు, తెలిసినదా ?

గుల్—ఏ రీతిని ?

ఆబా—నీచెంత శస్త్రము లేదుకావున పారాలో నుండుటకు వీలులేదను మిష పెట్టి దానిని పుచ్చుకొనుము. ఈకత్తిని జ్ఞప్తి నుంచుకొనుము. ఆమెచచ్చెనా నీకును చావు మూడును.




# మూడవ అంకము

---

## — మొదటి రంగము —

(శివాజీమహారాజు, అహమ్మద్, ఆబాజీ, బాలకృష్ణపంత్)

అహ — శివాజీరావూ, నేను మీచేతిలో చిక్కితిని, నన్నేమిచేయుటకునూ మీకు స్వాతంత్ర్యమున్నది-మీరు నాపై కృపవహించుటకు హేతువెద్దియు కానరాదు. పరాజితులయిన హిందువులపై మావారెన్నడూ దయదలచుట లేదు. వయోవృద్ధుడనగు నన్ను మీరు కరుణింతురని నే నపేక్షించుట లేదు. ఎంతోకాలము బ్రతుకువాడను కాను గావున నన్ను చంపకున్న హర్షమూ, చంపిన విషాదమూ చెందబోను. నాజీవితశేషము గౌరవదాయకమయినచో దానికి హాని ఘటించునప్పుడు దుఃఖించుట సహజము; పదభ్రష్టుడనై చెట్టంతకొడుకునూ కోడలినీ కడుపునబెట్టుకొని మొండికట్టెవలె నేను జీవించుటవలన ప్రయోజనమేమి? కావున నాభావిగతికి నేను దుఃఖమొందను. తొలుత సుఖో

దకముతో స్నానముచేయ నారంభించినప్పుడు మానవునకు నిర్మలోదకము లభించును, ఆయుర్దాయమును పాత్ర రిత్తవను చున్నకొద్ది పల్వలోదకము ప్రాప్తించి తుద కాపాత్ర అడుగున చేరియున్న బురదయే దక్కును.

శివా—మీకు తుదికోరిక యేమియు లేదా?

అహ—ఎన్నడును మిత్రునైనను నేనెద్దియు యాచింపలేదు; అట్టియెడ క్షుద్రమనస్కుడనై శత్రువును యాచించుట నాకు ప్రాణగొడ్డము కాదా?

శివా—సరే-నేనెట్టిశిక్ష విధించినను దానికి మీరు సిద్ధముగా నుండుటచే నాశిక్ష మీకు నిష్ఠురము కాదు. ఆబాజీ, వీరిచేతినుండి మీరు లాగుకొనిన శస్త్రము నిటు తెండు. [ఆబాజీ దానిని తెచ్చును.]

అహ—ఆహా! యావజ్జీవము నాచేతి నలంకరించియున్న నాప్రియమైన ఖడ్గమే నాకంఠమును ఖండింపనున్నది కాబోలు! నా నుదుటివ్రాత యిట్లున్నదా? శివాజీరావు! నాకత్తితో నాకుత్తుక నుత్తరించుట నాకెంత అప్రియమైనను నేను దానికి సిద్ధపడియే యున్నాను. వయసుమీరినవాడ నగుట శూరుని ప్రజ్ఞ నాయందు క్షీణించినను వీరున కుండదగిన నిస్పృహ నాయందు నశించుట లేదు.

శివా—ఉదారులు సాహసులు నగు తమబోటి శత్రువు శిరచ్ఛేదనము చేయించితినేని నేను మానవుడగానని మహీతలమునకెల్ల విశదమగును. అయ్యో, ఈఖడ్గము తమ

హస్తమందున్న శోభిల్లునుగాని, కంఠముపై నుంచుట శోభస్కరము కాదు, కావున పూజ్యభావమున అత్యంతాదరముతో దీనిని మీకు కానుకగా నిచ్చుచున్నాను, దానిని మామీఁద ప్రయోగించుటకు మీకవకాశము చిక్కనప్పుడు నిరభ్యంతరముగా మీకు వ్యవహరింప వచ్చును. ఇంతేకాక మీదుర్గమూ మీస్వాతంత్ర్యమును మీ కొసంగితిని-మీరు యథేచ్ఛగా సుఖింపుఁడు.

అహ—ఏమి మీ దయాహిల్లోలము! నేను మేలొ్కని యున్నానా? లేక కల గనుచున్నానా? నాకు గర్భశత్రువులగు మీరు నా కుపకారులైతిరా? శివాజీరావూ, మీరు నాకు పుత్రకల్పులని భావించి మీకు సమస్త కళ్యాణప్రాప్తి యగుగాక అని ఆశీర్వదించుచున్నాను.

ఆబా—తథాస్తు.

శివా—కళ్యాణదుర్గము నాకు స్వాధీనమగుట అంత గొప్పవిషయము కాదు. నాపక్షమున మీరే దాని కధిపతులుగా నున్న నాకు సకలకళ్యాణములూ చేకూరినట్లే. మీబోటి సామంతులే రాజునకైనను కళ్యాణసంధాయకులే. ఉదారవీరుల తోడి పరిచయ మబ్బుటయే గొప్ప అదృష్టము. అధముడగు మిత్రునికన్న ఉత్తముడగు శత్రువు మేలు.

అహ—సందియమేమి? మహారాజా, నీయౌదార్యము అసామాన్యము. కళ్యాణదుర్గమునకు నన్నధికారిగా నియమించుట తత్పరమావధియే. కాని నే నాపదవిని స్వీకరింప

జాలనందుకు చింతించుచున్నాను. నేను మీకొలువు చేసితినేని అదిల్‌శాహా యెడ ద్రోహినగుదును. ఒకస్వామియెడ ద్రోహ మొనర్చిన వాడు ఇంకొక స్వామియెడ ద్రోహ మొనర్పడా?

శివా—మీ రిట్లందురని నే నెరుగుదును. మీ కిష్ట మున్నప్పుడు మీరు బిజాపూరు దయచేయవచ్చును. పల్లకి సిద్ధముగా నున్నది. మీ సొత్తంతయు గొనిపోవుటకు వాహనము లాయత్తమున నున్నవి. అమాత్యవర్యా, వీరికి అమూల్యవస్త్రాభరణము లిచ్చి పంపుడు.

అహ—యుద్ధమున చెరలోపడిన నేను బీజాపురమున కిక రాజవైభవమున బోనగలనా? శివాజీరావ్జా, మీబాహుబలమునను సౌజన్యసంపదతోడను విజయశ్రీని వరించుటకు మీరే సమర్థులు, ఇందు సందియము లేదు. క్షుద్రుని జయించుటకన్న మహాత్మునిచే జయింపబడుట శ్రేయము .. నే నిప్పుడే బీజాపూరునకు పోయియుందును, కాని నాకొడుకూ కోడలూ ఏమయిరో తెలియువరకును నాచిత్తమునకు శాంతి చేకూరదు. కావున కొలది దినములు నన్ను మీయొండ నుంచ వేడుచున్నాను.

శివా—అట్లే కానిండు. మాయిల్లు మీయిల్లుగ భావించి మేమే మీ కతిథుల మన్నట్లు మసలుడు-ఆబాజీ, వీరి కొడుకుజాడయు కోడలిజాడయు నేటి సాయంత్రమునకు తీయగల్గు చారుల నియోగింపుడు, జాగుసేయవలదు.

(పోవుదురు)

———

## — రెండవ రంగము —

గుల్ జార్ ఖాం.

గుల్—నాశత్రుభారము నన్ను వదిలి పోయినందున కొంతసేపు సంతసము కలిగెను, కాని అప్పటినుండియు ఏమో తోచకున్నది. నాకళ్ళు నడలిన ట్లున్నవి. హుసాక్కా మీలువెచు హాయిగా నుండినున్న నిన్నరాత్రి లూటీలో దాని నెవడో దోచుకొనిపోవుటచే అది నాకంట పడలేదు. ఇంక నది దొరు కునా?......

ఎవరో మరాఠాసర్దారులు లిటే వచ్చుచున్నారు. వీరి ప్రాపకము సంపాదించితినా, గాహుసాక్కా నాకు దొరకవచ్చు ను...వారేద్దియో ముచ్చటించు చున్నట్లున్నారు-నే నిక్క డనే పొంచియుండి తరుణము కనిపెట్టి వారిని జేరి హుక్కా ప్రసంగము చేసెదను (తెరప్రక్కకు తొలగును)

(ఆబాజీ శంభూజీలు వత్తురు).

శంభూ—మీ రేలయో అవకతవక చేసి వ్యవహా రము ఆనుమూ డనిపింతురని నా కాదినే స్ఫురించెను. దాని భర్త బ్రతికియున్నాడని సూచించుటయే గొప్ప పొరపాటు. ఆసంగతి నెరిగిన అభిజాత అన్య నభిలషించునా? అనురా గమో అభిమానమో దానిని వెన్కకు లాగదా?

ఆబా—ప్రమాద మే సంభవించెను. మొదటనే మీరు నాకు దీనిని సూచించిన బాగుగ నుండియుండును.

శంభూ— పరోపదేశపాండిత్యము పూర్ణఫలదాయక మగునా? ఇంత యేల? మొదటే ఈపని నేను పూనియుండ వలసినది.

ఆబా—ఇప్పు డేమిమించిపోయినది? మీరు ఇప్పు డైన నిర్వహింపగలరు.

శంభూ—కార్య మింకనూ మించలేదు. జరిగినదం తయు కొంతవరకు మేలే-ఇప్పటి అనుభవమునుబట్టి ముందు మీరు జాగరూకులై యుందురు; కాని ఇంతలో నామె ఆత్మ హత్య చేసుకొనదు కదా?

ఆబా—లేదులేదు-ఆవిషయమును తగినపర్పాటు చేసి యుంచితిని. అయినా వినుము. ఓరీ ఖోజ్జా, మీదేవి సురక్షితముగా నున్నదా?

గుల్—నేనిప్పుడే వారిచెంతనుండి వచ్చుచున్నాను. దుఃఖావేశులై అతికష్టముతో మాటలాడుచున్నారు.

ఆబా—నీకు నియమించినపని నెట్లు నిర్వహించితివి?

గుల్—మీరు చెప్పినట్లు ప్రకారి నామెచేతినుండి సంగ్రహించితిని. ఒకసారి దానినిమ్మని ఆమె అడిగెను గాని, ఎచ్చటనో యుంచితినని చెప్పి నాచెంతనే దాచిపెట్టితిని.

శంభూ—భళిర! ఆకితేరిన పోకిరివే. దాని నిటు తెమ్ము (అత డిచ్చును) ఆబాజీ! నిశ్చింతులై మీరు పొండు, నేను కార్యము నిర్వహించుకొని వచ్చెదను. (అతడు పోవును)

గుల్—మహాప్రభూ! నా దొక మనవి.

శంభూ—ఇప్పుడు నాకు తీరుబడి లేదు. నీయజమాను రాలిని గాంచిన పిదప వినెదను.

గుల్—దేవరవారి చిత్తము.

శంభూ—నే నామెను చూడవచ్చితినని చెప్పుము. (గుల్‌జార్ పోవును) శివాజీ తన అకలంకకీర్తి కపాత్రుడని నిదర్శనము చూపినంతమాత్రమున నేను తృప్తి నొందజాలను. వాని నంత మొందింపవలయు, నాకోర్కె ఫలించవలయును.

గుల్—అమ్మగారు రించుక చిరచిరలాడుచూ నై దీని కలుసుకొనుటకు ఒకరి యనుమతి అనవసర మనిరి.

శంభూ—సరే-నీ విక పొమ్ము. (వాడు పోవును) ఈ నల్లతాచు నన్నొకకాటున కాలుని పీటికి పంపవలెనని తలచు చున్నది కాని నేను దానికితగిన మాంత్రికుడనే, బుజ్జగించియో భీతిగొల్పియో దానిపొగరణచి బుట్టలో పెట్టకమానను... బీబీగారూ, బీబీగారూ! (తెర ఎత్తబడును)

హసీ—బీబీగారు నిన్నటిదినమే మృతినొందిరి. మీ యెదుట నున్నది బందిఖానాలోనున్న స్త్రీ.

శంభూ—మీతో మిత్రభావమున ముచ్చటింప వచ్చి తిని. నన్నించుక విశ్వసింపవలయు.

హసీ—మరాఠాలకూ మైత్రికీ చాలదూరము. ఆ మాట నెరుగుదురేమో కాని దానిభావము మాత్రము వారి కపరిచితము. వారు విశ్వాసఘాతకులని ప్రపంచమందెల్ల పేరు పడినారు. ఆవిషయము నా కనుభవసిద్ధము కాలేదు.

శంభూ—వారందరు నొకతీరు వారనియా మీ యూహ?

హాసీ—అందరూ ఒకలాగున నుండకపోవచ్చును. కాని ఆబద్ధస్నేహితు లొకతీరున నుంట సహజము-మీ మిత్రులొకరు ప్రొద్దుట ఇక్కడికి కను చేసి మాతుశ్రీ) అని నన్ను పో తారపిలిచి నన్ను వారివలలో పడినదానిగా భావించి మీ శివాజీకి నన్ను భోగినిగా చేయుదునని సిగ్గుమాలిన ప్రసంగము చేసిపోయిరి.

శంభూ—"యథా రాజా తథా ప్రజాః" ప్రభువును బట్టి సేవకులు—

హాసీ—అటులనా? మీరు శివాజీసేవకులు కారు కాబోలు?

శంభూ—మనసార వాని సేవకుడ గాను, కార్యాంతరమున సేవకపదవి స్వీకరింపవలసి వచ్చెను.

హాసీ—ఎట్టి కార్యము?

శంభూ—మహారాజును మట్టిచేయుటయే.

హాసీ—మీ కాతఁ డేమికీ డొనర్చెను!

శంభూ—నన్ను పలునష్టములు పాలుచేసెను. నేనతని సవతి మేనమామను. సుపేంప్రాంతమున సుబేదారుగా నన్నాతనితండ్రి నియమించెను. నేను వసూలుచేసిన పైకమూ నాస్వాధీనముననున్న గుఱ్ఱపుదళమును, బలవంతముగా లాగుకొని ఏవో లేనిపోని నిందలు నాపై బెట్టి నన్ను వూనాకు

రావలెనని ఆజ్ఞాపించినాడు. నేను దానిని తృణీకరించుట న్యా
యమే కదా? నిన్నటి మావళాలతో వచ్చి నన్ను బంధించి
నాసర్వస్వమును కరగతము చేసుకొన్నాడు.

హాసీ—ఈమాత్రపు పొరపాటునకు మీ మేనల్లునే
నాశనము చేయబూనితిరా?

శంభూ—మొదట నాపత్నే అంతపనిచేయుటకు
చాలును. దానిపై నిది రెండవ హేతువు-మాకు ప్రాణము
కన్న మానము శ్రేష్ఠమగాట హత్యచేసియైన మానహాని తొల
గింప జూతుము. అంతకన్న నెక్కుడు ద్వేషకారణ మింకొ
కటి కలదు. ఆత్మరక్షణార్థ మాతని శిక్షింపకతీఱదు. "స్వ
రాజ్యస్థాపనమునకు పరాఙ్ముఖులైన వారి నెల్ల వధింపబూని
తి"నని నన్ను ఆతడు బెదరించినాడు. మనసునురావి కొలు
వును బలవంతముగా నానెత్తిని చుట్టినాడు. ఇంత దూరమున
న్నత డవమానించియుండ, ఆతడు పూనిన పిచ్చిపనిలో నే
నతనికి సాయముచేయుట కలలోని వార్త. వీలైనంతవరకూ
అడ్డువేయుచుందును. ఆత డదిగుర్తించి నన్నుచంప గమకిం
చుటకు పూర్వమే ఆతని ప్రాణముల నేను హరింతును.

హాసీ—అట్లు చేయబూనుట ద్రోహము కాదా?

శంభూ—నన్నాతడు చంపకపూర్వ మాతని నేను
చంపబూనుట దోసము; ఆతడు నన్ను చంపిన పిమ్మట నే
నతని జంపుట అసంభవము; కావున ఆతనికి చావే ఘటిం
పదు. బీబీగారూ, మీవంటి వకీలు శివాజీకి లభించుట ఆతని

భాగ్యము, నా దౌర్భాగ్యము- పోనీ, నే నాతని స్వయముగా చంపక ఇతరులచే చంపించిన మీ కభ్యంతర ముండదు కదా!

హాసీ—హత్య చేయబూనుట అమానుషము, దానిని రాక్షసకర్మ అనదగును. కావున మీ రెవరిచే వానిని చంపింప గడంగుచున్నారో వా రావని చేయుటకు తగినంత కారణ ముండినచో నట్టి అభ్యంతరము నుండబోదు.

శంభూ—ప్రియతము డైన ఆ ప్రబంధువును చంపుట కన్న బలవత్తరముగు హేతువు వింకొకటి యుండునా ? మీవలె దీనురాలగు నొకసతీమణిభర్తను శివాజీ చంపించి నచో ఆమె యాతని చంపుట సకారణము కాదా?

హాసీ—సద్గురుగారూ, అట్టి ఘోర మైన కల్పన దృష్టాంతము కొఱకై నను నాపై నారోపింపకుడు.

శంభూ—అట్లు కాదు తల్లీ, దనసాయము నాకగునప్పుడు వినగూడని అవస్థలకు గూడ మనము సిద్ధపడి యుండ వలయు. మీ రిప్పుడు స్వాతంత్ర్యహీనులు, మీ భర్తగారు బందిగ్రాహులై యున్నారు, శివాజీ మీపై పాపదృష్టిపరచుట చేత మీపతిని తొలగించిన గాని తనపాచుపని సాగనేరదని ఆత డెరుగును. ఇట్లు పరిస్థితులన్నియు మీకు ప్రతికూలముగా నున్నప్పుడు మీ రావిషయమున ఉపేక్షవహించుట పాడిగాదు. వ్యవధియుండగనే ఉత్తరగతుల నాలోచించుకొని నచో విపత్తి సంభవించునపుడు మీకు ముందువెన్కల

నరయు నక్కర యుండదు. మీవిషయమున భావించుటకేని అయోగ్యమగు నాపని నాపాపి ఈవలకే నిర్వహించెనేమో!

హాసీ.—మీమాటలు వినుచున్న నా కొక భీకరమైన సందేహము పొడముచున్నది. ఏదో అశుభవార్త మీకు తెలిసియున్నను నాయొద్ద దానిని మరుగుపరుచుచున్నారు.

శంభూ.—నిన్నటిదినము తమపతి మృతిజెందెనేమో అను సంశయము కల్గినంతమాత్రముననే మీరు మూర్ఛిల్లిరని వినినప్పటినుండియు భయావహమైన వార్తను మీకు తెల్పుటకు తెగించలేకున్నాను.

హాసీ.—మీ రెట్టివార్త తెల్పినను దానిని వినుటకు నేను గుండె దిట్టపరుచుకొని యున్నాను. ఆ మోరకులు నాప్రాణనాథుని పలుబాముల పాలుజేసి ప్రాణములు హరించిరా? కన్ను లూడపెరికిరా? ఏనుగకాలునకు గట్టి ఈడ్పించిరా? అబ్బా! ఇట్టి దారుణవచనములు నానోటనుండి వెలువడుటకు నాగుండె ఎంత గట్టిది కావలయునో ఇంచుక భావించి మీకు చెప్పదలచిన దెద్దియో చెప్పుడు.

శంభూ.—మీమాటలచే నాకార్యము చాలవరకు సులభమైనది. అత్యాదరము పాపమునే శంకించుచుండును. భయభ్రాంతలై మీరొనర్చిన కల్పనలు క్రూరులగు పగవారికి తోచలేదు. మీనాథుని హింసించుటవలన వారి కెట్టిలాభమునూ కలుగబోదు. ప్రాణాపహరణముననే వారికి సర్వమునూ నెరవేరెను. రేయంతయు జాగారము సల్పుటచే శ్రాంతములై

కనులు మూతపడుచుండగనే—

హాసీ—నిదురలోనే!

శంభూ—గొంతు నులిమి—

హాసీ—చంపిరా? అయ్యో! ఈమాట వినుటకే కాబోలు నేను బ్రతికియుంటిని. నాథా! జాగ్రదవస్థలోని సంకటములనెల్ల మరచి స్వప్నమున నాతో ముచ్చటించుచుండ ఆపాపులు మీస్వప్నమునగా జీవము నొకసారియే అంతమొందించిరా? మీ అనంతరమున నే నొకక్షణమైని ప్రాణముల భరించియుండనని ఎన్నియో సారులు నమ్మించి నేనొనర్చిన బాస వమ్మయ్యెగదా? మీ రీజగమును వీడి పోయినను నా కెక్కడిదియో నీచకార్యము పడిపోయినట్టు బ్రతికియుంటిని, ఇదేమిసుఖమో నాకు స్ఫురించుట లేదు. మీవెనువెంట నేనుకూడ వత్తునను ఆసతో నన్ను ప్రతీక్షించుచున్నారా? నేను అనురాగ విడంబన మొనర్చుచుంటినే కాని క్రియ సున్న అగుచున్నది. ప్రాణప్రియా, స్వర్గప్రవాసముకన్న నాక్రోడమున నుంటయే శ్రేయమని మీ రెంచుచునా నాదండనున్నప్పు డచ్చరలు కూడ పశ్చిమగణ్యాలని తలచుచుండిరి. నేను మీచెంత లేనుగదా స్వర్గమున మీకెట్లు తోచుచున్నది? సరససల్లాపములు మీ మనసు రంజిల్లచేయువా రెవరు?

శంభూ—మీభర్త సజీవుడై యుండ మిమ్మెవ్వరూ అపేక్షింపజాలరని మీరు నామిత్రునితో నుడివిరట.

హాసీ—అందుచే ఆచండాలులు నానాథుని వధించిరా? ఒకరి ననసేల? నా నోటనుండి ఆమాట రాకున్నచో నామనో నాథుని కీగతి వాటిల్లకుండునుకదా? అయ్యో! ప్రాణప్రియా, మీప్రాణముల నేనే హరించితిని- స్వప్నప్రపంచమున మీరు నాతో సయ్యాట లాడుచుండ మీ కంఠమును నేనే నులిమి వేచితిని. మీరు నాపై వర్షించిన ప్రేమవృష్టికి మారు మీ రక్తవృష్టిని ఘటిల్లజేసి నాకృతఘ్నతను తార్కాణించితిని. ఘాతకురాల నగునాకు మరణమే తగిన శిక్ష. మిమ్ము నోటితో చంపుకొన్నందుకు నన్ను చేతులతో చంపుకొనుట యుక్తము.

శంభూ—మీరు భ్రమపడుచున్నారు. ఇందు మీ నేరమేమి? పతిభక్తిని నిలుపబెట్టుకొనుట సతులకు సహజము- అట్టివారు ప్రశంసనీయులు, వారి శత్రువులు నింద్యులు. మీ శత్రువునెడ ప్రతిహింస తలపెట్టకమున్ను మీ రాత్మహత్యకు కడంగుట భావ్యము కాదు.

హాసీ—అవును—శత్రువును ఖండించుటయే నాకు ప్రథమకర్తవ్యము-నరే-తెలుతి శివాజీప్రాణముల హరించి పిదప ఆశస్త్రముతోనే నాకుత్తుకను ఉత్తరించుకొందును. పతిని జంపుకొన్న పలుగాకి పగవాని జంప శంకించునా?

శంభూ—చెప్పుట సులభమే కాని శస్త్రము లేక ఆకార్యము సాధించుట అసంభవము.

హాసీ—హత్య చేయుమని నన్ను ప్రోత్సహించుచు వెంటనే పిరికిమందు పట్టుచున్నారే?

శంభూ—కార్యసిద్ధికి కలుగబోవు విఘ్నముల ముందే తెలుపకున్న మీ ప్రయత్నము సాగి నేర్చునా?

హాసీ—ఔను. దుఃఖావేశమున నుంటచే నాచిత్తము, స్వాధీనమున లేదు. అందుచే నేమేమియో అనుచుందును, క్షమింపుడు.

శంభూ—మీరు ప్రాణహాని తప్పక చేసుకొందురను భీతిచేతనే ఆబాబు మీ కటారిని కూడ మీయొద్ద లేకుండునట్లు చక్కజేసెను. ఆతనికన్ను మూసి దీని నేగొనివచ్చితి. ఇక మీరు కార్యము నిర్వహింపవచ్చును. (దానినిచ్చును)

హాసీ—మిమ్మిప్పుడు విశ్వసింప గల్గితిని, కాని ఆచండాలుడు నాకు చిక్కుటెట్లు?

శంభూ—అందుకు తగిన ఏర్పాటు చేసి వచ్చితిని. నేడు దర్బారు ముగిసినంతనే ఆతని మహాలులో మీ కాతడొంటిగ దొరకును.

హాసీ—కంటబడినతోడనే కటారితో వానిని కాలుసింటకి సంపుట కాటంక ముండదు కదా?

శంభూ—కాదు, కాదు. అట్లు చేయబూనుట ప్రమాదజనకము. మీ రొండొరుల తారసిలునపుడు జరుగవలసిన చర్యలో మీ రెంతజాగరూకతతో మెలంగినను అదకొద్దియే అగును.

హాసీ—అటులనా?

శంభూ—ఆతడు సామాన్యు డనుకొంటిరా? మహా

రాష్ట్రిలలో మిక్కిలి పేరువడసిన జోదు, ఊహాలకు పుట్టిల్లు. మీా చేష్టలనుబట్టి మీా యుద్దేశమును కనిపెట్టినచో మీా యత్నమును విఫలము చేయగలఁడు. అనుచరు లెందరో అహర్నిశము వానినంటి యుందురు.

హాసీ—నే నెట్లు వర్తింపవలయునో ఉపదేశింపుడు.

శంభూ—మొట్టమొదటి అంశ మెద్దియన, మీారు సుబేదారుగారి కోడలని వానికి తెలియనీయకూడదు.

హాసీ—బాగుబాగు-ఈ గ్రంథమంతయు రచించిన వాని కీసంగతి తెలియకుండునా? అట్టియెడ నేను దాచుట వలన ప్రయోజనమేమి?

శంభూ—ప్రయోజన మున్నది- సుబేదారుకొడుకు విగతజీవుడై యుండ ఆతనిభార్య అరమర లేకయే తనకడ కేతెంచుట చూడ శివాజీకి సంశయము జనించును. ఆత దతి చతురుఁడు, అనన్యసామాన్యలోకజ్ఞానసంపన్నుడు. వేరొకస్త్రీ తన్ను వరించి సన్నిధినిచేరెనని ఆతనికి తోచునట్లు మీారు వ్యవహరింపవలయును.

హాసీ—ఆహా! విధివిలసితము అనూహ్యము.

శంభూ—వాని కట్లు తోచవలయునన్న మీా చేష్టల యెడగాని పలుకులందుగాని కాఠిన్యము కానరాకూడదు;ముఖ మున మందస్మితము నటింపవలయు, ప్రవర్తనయందు ప్రేమా దరము ను, సంకోచము, గాంభీర్యము లాలనయు కుదురుపడి యుంపుగానుండవలయును.

హాసీ—అయ్యో! నా ప్రేమనిధి, నా ప్రాణేశుని చిత్తరంజనమునకై సృజింపబడిన నా శృంగారచేష్టలు ఆతని గర్భశత్రువునెడ కపటబుద్ధితో కన్పబఱుపవలసివచ్చె గదా! కాని వైరనిర్యాతనమున కత్యవసరమగుటచే నేను వాటిని విడంబించిక తీఱదు.

శంభూ—ఇంకొకటి-ఆత డతిమితభాషి-మీ రాతని వలచితిరని దృఢవిశ్వాసము కుదురునవఱకూ మీతో నాతడు ప్రేమాలాపమొనర్పడు, మీ కెంత జేగుటెట్లు? మీ కార్యము సిద్ధించుటెట్లు? అతని చేరదీయుటకు ఎన్ని యుక్తులను ప్రత్యుక్తులను పన్నవలసియుండును. ఆతని చూచినతోడనే సాత్వికలక్షణములు మీ కలవడెనో లేదో స్వేచ్ఛచే పరీక్షింపవచ్చునని కూడ మీరు కోరదగినదే.

హాసీ—వలదు, వలదు-ప్రతిహింసాపరాకాష్ఠను పరిత్యజింతును కాని తత్పూర్తికై ఆపాపిని నా దేహము నంటనీయను.

శంభూ—ఇంతమాత్రము నే నెఱుగనా? మాటవరుస కట్లంటిని కాని వానిచేయి మీగాత్రమును సోకునంతలో మీకటారి వానిహృదయమును చీల్చివేయునని నే నెరుగుదును. స్త్రీలు వగవద్దికల విషయమున పురుషుల ఉపదేశమనావశ్యకము. వారి స్వాభావిక చాతుర్యమే వారి కన్నిటిని నేర్పగలదు.

హాసీ—సరే. చెప్పదగిన దింకేమైన నున్నదా?

శంభూ—సహజసుకుమారమగు మీ తనువును పుష్ప

హారములు చేసైన గాసిలజేయుదుము. వాటిమూలమున సాజమగు వన్నెగూడ మాటుపడుచున్నది.

హసీ—మీసలహాకు తగిన ఫలము మనకు చేకూరును గాక! (పోవును)

శంభూ—ఓరీ కంచుకీ, నేటి సాయంకాలము నీయజమానురాలితో గూడ 'శివాజీమహారాజు మేడ కరుగుట కాయత్తుడవు గమ్ము.

గుల్—అట్లే యుండెను కాని నిన్న లూటీలో మీ సైనికులు, నాహుల్కాను గొనిపోయిరి. నా ఆదాయమంతటి నిచ్చి కొన్నాను. దానిని నాకు తిరుగ నిప్పించి పుణ్యము కట్టుకొనుడు.

శంభూ—దానికొక చిన్నయుక్తి కలదు- సైనికులు సంగ్రహించిన లూటినంతటిని నేటిసాయంకాలము మహారాజు నెదుట పెట్టెదరు. అందు స్త్రీలసొత్తంతయు వారికి మగుడ నిచ్చుట ఆచారము-నీహుల్కా నీకు లభింపవలెనన్న నీవు మోమున మేలిముసుగు వేసుకొని చేత కంకణములు దాల్చి దర్బారునకు వచ్చి హుల్కా నీసొత్తని చెప్పి దానిని గొని పొమ్ము. స్త్రీలయెడ మహారాజంత విచక్షణ గన్పరుపడు.

గుల్—మగవాడను, చేతులకు గాజులెట్లు తొడిగించుకొందు నయ్యా! బాహుబలముచేతనే పురోవృద్ధి గాంచవలెనని యెంచుచున్నానే.

శంభూ—అంతమాత్రమున నేమియు చెడదు-నీవు

హుకాల్కును బాహుబలముచేతనే కదా ఆర్జింపబోవుచున్నావు.

గుల్—ఔ నౌను-విధి తప్పి వచ్చినప్పుడేమి సేయ నగును?　　　　(పోవుదురు)

---

—• మూడవ రంగము •—

---

(నఈ బాజి సోయరాబాజి)

సోయ—సుబేదారు కుమారుడూ కోడలూ యుద్ధపు సందడిలో కానరాకపోయిరి-ఇంతవరకూ వారిజాడ తెలియకుండుట ఆశ్చర్యమే. పాప మా ముసలి సుబేదారు వారి వియోగముచే నిద్రాహారముల మానుకొన్నాడు.

నఈ—మనచారులు వారిజాడ తీయకమానరు.

సోయ—మహారాజుగారి కాదంపతుల జాడ తెలియదనియా మీ యూహా? నే నట్లు తలపను.

నఈ—ఈ విషయము వింతగనే యున్నది. దేశమందంతటను వలవేసినట్లు చారుల నియోగించియున్నారు. ఈ పాటి వారి ఆచోకీ తేలవలసినదే.

సోయ—మహారాజు గారీవిషయము నెరిగియుండియు దాని కప్పిపుచ్చుటకు హేతు వేమైయుండును? ఇదిగో బాబుగారు వచ్చుచున్నారు, వీరి నడుగుదము. (శంభూజీ వచ్చును)

శంభూ—మీరు వచ్చినది మొదలు మీతో రహస్యముగా మాటలాడవలయునని యత్నించుచుంటిని కాని

దానికెద్దియో విఘ్నము కలుగుచునే యున్నది-సుబేదారు కుటుంబము జాడ కనుగొమ్మని శివబా నన్నే నియోగించి నాడు-ఆ టక్కరి ఉయ్యాలలో పిల్లడినుంచి ఊరెల్ల వెతకించు చున్నాడని నాకు తోచుచున్నది-వారి నెచ్చటనో రహస్యముగా వేత్యేరబంధించి యుండునని లోకులు చెప్పుకొను చున్నారు. వారిమాట నమ్ముటకు వీలుండునట్లు తోచదు. ఆ సుబేదారుకోడలు అసమానసుందరి కావున ప్రజలు శంకాన్వితులై పలువిధముల పల్కుచున్నారు.

సోయ—ఆమె అంత చక్కనిదగుట నిజమా?

శంభూ—మిమ్మిద్దరను మినహాయించినట్టిఅందకత్తె వేఱొకత్తె లేదందురు.

సఈ—ఈ ముఖప్రీతి వచనములకేమి! మీపలుకులు సోయరా విషయమున చెల్లునే కాని నన్నందు జేర్చుటకు వీలులేదు.

సోయ—అట్లుకాదు. సఈబాయి వంటి సద్గుణవతి యగు చాన నెందును గానము-మీ రట్టిసౌందర్యమును గూర్చి వర్ణించి యుందురని తోపదు. నా మాటకేమి? పతి ప్రీతియే ముఖ్యమని నాయూహ-అదియుండునాతియేఅందకత్తె. నాయం దెన్నిలోపము లున్నను నానాథుడు వాటినెల్ల సవరించుకొనును.

శంభూ—సోయరాబాయీ, సౌందర్యవిషయమున నీకు గల ఆధిక్యము వృథకాదు. సౌందర్యమున అనేకభేదములు

లున్నవి. హిందూసుందరుల సౌందర్యము వారి సాత్వికదృష్టి యం దుండును. తురకసుందరుల అందము వారి రాజవిలాస దృష్టిలో నుండును. తురకల ప్రభుత్వచిహ్న వారిస్త్రీల ముఖ ములందు గోచరించుచుండును. ఇదిగాక వారియందు స్వాభి మానలావణ్య మలరారుచుండును. దానిదెస వీరునిదృష్టి తప్పక పరుగెత్తుచుండును. అభిమాన మెచటనున్న-అనగా స్త్రీలయందుగాని పురుషులయందుగాని అది పొడచూపెనా- దానిని రూపుమాపువరకు వీరునకు చిత్తశాంతి యుండదు.

సోయ—మహారాజుగారిదృష్టి మహమ్మదీయవనితపై బడెననియా మీ అభిప్రాయము?

శంభూ—ఎంతమాట! ఇది నాఅభిప్రాయ మనుకొం టిరా? కుత్సితులగు ప్రజలమాట నే చెప్పుచుంటిని. వారి నాలుకలకు నరము లుండవు. శివబా తానువిడిసియున్న మేడలో ఆమెను దాచెననియు, అనుదినమూ వారు సల్లా పము లాడుచుండురనియూ పుకారు పుట్టినది-దీని కాధార ము గంటిరా? ఆమేడ అతిపిశాలము నందు పలుసేల మాలెలు, రహస్యమార్గములూ కలవట! ప్రజల దుడుకుతనము నకు మేర యున్నదా?

సఈ—ప్రజలది తప్పుకాదు- మహారాజుగారి మన సును వా రేమెరుగుదురు? ఎల్లప్పుడూ వారిచెంత నుందుము కాన వారిశౌచమూ సచ్ఛీలమును అరచేతిఅద్దమువలె తెలిసి గనుచుంధుము. ఇట్టి అవకాశమితరులకు కలుగకుంచేసి వా

గాన్నిదైన నందురు.

శంభూ—సోమరాజా, ఆ కుటిలాత్ముల మాటలు నీమనసున గ్రుచ్చుకొన్నవా? ఇది యుక్తము కాదు. మీకును లోకులకును గలవాదమును నే నొకమాటతో నిరవశేష ముగ తీర్పగలను.

సోమ—ఎట్లు?

శంభూ—శివబా కల్మషచిత్తుడైనచో మిమ్మిద్దఱ వెంటగొని వచ్చునా?

సోమ—సరిసరి-ఇదియా మీతీర్పు! అట్లు గొని వచ్చుటకు వా రెన్ని ఆటంకముల బెట్టిరో మీ రెఱుగరు. ఎంతో పట్టుబట్టి వారి యాటల సాగనీయక మేము వెంటబడి తిమి. ఏమక్కా! నీవేమందువు?

సతీ—అది నిజమే కాని, వారుచెప్పిన కారణములు కూడ యుక్తమయినవే. ఇచ్చట శాంతి యింకనూ అలవడ లేదు, నలుదెసలా అల్లరులు రేగుచున్నవి. రస్తుసామగ్రి తగు రీతిని లేదు. అట్టియెడ ఆడవారు వెంటనున్న మగవారు నిరా టంకముగా వ్యవహరింప వీలుపడదని వారు నొక్కిచెప్పిరి.

సోమ—ముందువాటి కేమిగాని తుదిమాట సత్య మని ఒప్పుకొని తీరవలయును.

శంభూ—మీమాటలబట్టి లోకుల ఊహలు సత్యము లనియే తేలుచున్నది. కావున శివబా శుద్ధాంతరంగమును పరీక్షించుటకు ఇంక కాలయాపన మనవసరము. ఈ కోట

యందు జగదేకసుందరియగు ఒక తురకస్త్రీ శివబా సౌంద ర్యపరాక్రమముల కని విని ఆతని మోహించి తన సర్వస్వము నాతని కర్పణము చేయ నిశ్చయించుకొనినట్లు నే నిప్పుడే విన్నాను. తక్షణమే మీానంగని జ్ఞప్తికివచ్చి ఆమెను శివబా యెదుట పెట్టనా వద్దా అని మీాతో నాలోచింప ఇటు వచ్చితిని.

సఈ——పతిని సతు లిట్లు పరీక్షింపబూనుట పాపము కాదా?

సోయ——అది కాదు. నిర్మలగాహ్నవీనీరమువంటి పతిచారిత్రమును నిదర్శనముగా జూపి ప్రజల పాపచింతలను మాపుమాపుట పతివ్రతల విధ కాదా?

సఈ——సరే-మీా రాలోచించి యోగ్యములనితోచిన పనులు చేయుడు- మీా మాట కడ్డుచెప్పునంతటి దాననా?

సోయ——బాబుగారూ, మీా రౌనన్న నెంచిన కార్య మవశ్యమూ తీర్చుదు.

శంభూ——అట్లే చేసెదను కాని దానికి నే నణుమా త్రమూ ఉత్తరవాదిని కాను సుడీ.

సోయ——మీా కాభయము వద్దు- మహారాజుగా రందు కలిగినచో వానిని సమాధానపరచు భారము మాది- ఇందు మన ఉద్దేశము నిష్కల్మషముగా నుండ వారిభయము మీా కేల యుండవలెను?				(అందరూ నిష్క్రమింతురు)

---

## —నాల్గవ రంగము—

(ఒకగదిలో మహమ్మదు పచారుచేయుచుండును.)

మహ—సుఖ మింతక్షణభంగురమైనను దూరదృష్టి లేని నాబోటి మానవులు ఎంతెంత విపుల మనోరాజ్యముల కల్పించుకొనుచుందురు! వైభవమును ప్రేమయు మాసుఖసంతతి కాధారములు. ఇందులో నొకటైన శాశ్వతమా! కేవలము మాపైననే ఆధారపడియున్నది శాశ్వతమని యెంచ నగును, మావైభవమా దానిని హరియింప వేచియున్న శాత్రవుల చేతులలో నున్నది. ప్రేమ మామానసముల నాకర్షించిన మగువలచేతులలోనున్నది, రెండూ పరుల నాశ్రయించి యున్నవే. ఇందులో నొకదానినైన ననుభవించనిమానవుడు నూటికొక డుండును. ప్రేమనో వైభవమునో చవిచూచి అచిరకాలముననే దానినడబాయువారనేకులు గలరు. కాని రెంటిని యథేచ్ఛము గాచాలకాల మనుభవించి ఏకముహూర్తముననే వాటిని కోల్పోయిన నాబోటి నిర్భాగ్యుడొకడూ ఉండడు. వైభవముశాశ్వతమని నేనెంచలేదు, కాని ప్రేమ నా జీవితసర్వస్వమై యుండెను. మా కుటుంబమున నున్నవారము ముగ్గురము. నా దౌర్భాగ్యమున ముగ్గురము మూడుత్రోవల బట్టవలసివచ్చెనే! వారిద్దరూ జీవించియున్నారో లేదో? స్త్రీబాలవృద్ధజనముల ప్రాణములు పవిత్రములని ప్రతీతి. తండ్రిగా రనుభవ

శాలురగుట నీ సంకటము నెట్లని భరింపగలరు. కాని హసీనా గతి ఏమాయెనో? ప్రేయసీ! పంజరములోని పక్షివలె నీ వెట్టిబాధల పడుచున్నావో! శోకావేగమున నీమానసము కలత చెందినప్పుడెల్ల నా వక్షము నీశిరస్సునకు విశ్రాంతిస్థానమై యుండెను. నాకర్ణరంధ్రములగుండా నీదుఃఖమును నాహృదయ సాగరమున బోసి నీహృదయమును చులకబర్చుకొనుచూ నీ కన్నీటిని నాచేతులతో తుడుచుకొనుచుదానవు. ఇప్పుడు ని న్నట్లు ఊరడించువారెవ్వరు? ఏమాయెనుగని ముద్దరాలవు నీ కీనిర్బంధము ఘనమని తోచకపోవచ్చును, యుద్ధమున చెరగొన్న స్త్రీలను శత్రువు లేరీతిని పరిభవింతురో నీ కను భవసిద్ధ మగునప్పుడు నీ దుస్థితి కడుసంతాపకర మగును. ఈ మూపత్సముద్రమును తరింపదగిన మనస్థైర్యము అబలవగు నీ కెట్లలవడగలదు? బాధానివారణమునకై ప్రాణముల త్యజింతువో లేక ప్రాణములు తీపగుట వారు నిన్నుపెట్టు అగచాట్లను సైచియుందువో?...నీ వెట్లుచేసిననూ నాకు తృప్తియన్నది ఉండదు- ఈ పాడుచెవులు ఎట్టిపాపవార్తను విననున్నవో!

(శంభూజీ వచ్చును)

శంభూ—(స్వగ) హసీనా కొప్పగించిన పని అది నెరవేర్చగలదో లేదో సంశయమే. అభిసారికాపాత్రము నది ఎంత చతురతతో అభినయించిననూ సమయమునకు దాని ధైర్యము

క్రుంగిపోయెనాఫట్టిమునఁగును. కనుక దానిచేతఁగాక మిగిలియున్న దానినీ బాలిశుఁడు నేఁ వేళ్ళనట్లు చేతును. అది బ్రతికి యుండెనా నా పన్నుగడ బయలుపడుటకు సాక్షియగును కావున, త్వరలో దాని కాయువుమూడు యత్నము చేయవలెను. హసీనాచేత కానీ, వీనిచేత కానీ శివాజీ మడిసినచో మహారాష్ట్రరాజ్య గర్భిణి వారి భార్యలకు విశ్వాసపాత్రుడనైన నాచేత జిక్కక తప్పదు...సుపేఁ ప్రాంతము నాచేతులనుంచి హఠాత్తుగా లాగుకొనిన ఆదౌర్భాగ్యుఁడు తన యావద్రాజ్యమూ ఇంత త్వరలో నాకు కరగతమగునని కలనైన దలచియుండడు కదా! బుద్ధిబలమున్న నిట్లుండవలెను. (ప్రకా) ఏమి దొరగారూ, రాత్రి నిద్దర చక్కగా పట్టినదా?

మహా—నాబోటి దౌర్భాగ్యున కెంత నిద్రపట్టగల దో నాకూ అంతే పట్టినది. నిలువెల్ల నీఱయి యుండు నాకు నిద్ర యెక్కడిది.

శంభూ—విపద్దశయందును సంతసము చెందుట కవ కాశ మప్పుడప్పుడు చిక్కును. స్వజనదుఃఖము స్వసుఖమును చెరచునట్లు స్వజనసుఖము స్వదుఃఖమును తొలగించును.

మహా—నిజమే కాని నా ప్రకృతావస్థయందు నా స్వజనసుఖము నెరుంగుటెట్లు! ఒకవేళ శత్రుపక్షము వారి మూలమున దాని నారయుదమన్ననూ వారిమాటలు నమ్ము టెట్లు? అసత్యమూ కపటమును నన్ను వంచించుటయందు వారికి ముఖ్యసాధనములు, అందుకు వారి ననవలసిన పనిలేదు.

శంభూ—శాస్త్రవపక్షమువారు తమవార్తలకు తగిన నిదర్శనములను చూపిన వాటిని నమ్ముదురా?

మహా—అట్లు చేయుటవలన వారి కేమిలబ్ధి కలదు?

శంభూ—శతృత్వ మిత్రత్వము లాగంతుకములనియు మానుషత్వము శాశ్వతసంబంధమనియూ నిర్ధారితము కాదా?

మహా—మీమాటలు నాకర్థము కాలేదు.

శంభూ—మీకిట్టినుట మీబద్ధవైరిశిరము ఛేదింపబడినచో మీకు జాలిగొల్పునా?

మహా—ఏమీ! మాతండ్రిగారి శిరమును ఛేదించిరా?

శంభూ—లేదు. నేచెప్పునది ఉదాహరణము. పోనీ, ఇంకొకటి చెప్పెదను. మీబద్ధవైరి తనకత్యంతప్రియుడగువాని మరణవార్త విని ఏడ్చుచుండ మీ బోటి యుదారుల హృదయము కరిగిపోదా?

మహా—మీవచనములు సందిగ్ధముగా నున్నవి. నా ప్రియురాలగు హసీనావిషయమున నేదైన వైపరీత్యము ఘటిల్లినదా? త్వరగా చెప్పుడు.

శంభూ—నేనొక ఉదాహరణమును మనవిచేసితిని గాని జరిగినదాని గూర్చి ప్రసంగించలేనని ఇదివరకే చెప్పినాను.

మహా—నిదర్శనమును బట్టి విషయము నూహింపవచ్చును, నిదర్శనమింత భయావహముగా నున్నది గనుక విషయముకూడా అంత భయావహముగా నుండవలెను.

శంభూ—ఆవిషయము భయావహమగునో కాదో,

ఎంత భయావహమైనదో. వీటిని గురించి భిన్నాభిప్రాయము లుండవచ్చును.

మహా—లజ్జాకరమైన స్థితిలోనుండుటకన్న స్త్రీ మరణించుటయే మేలని చాలామంది అభిప్రాయపడుదురు.

శంభూ—మీ యభిప్రాయ మదికాదా?

మహా—హాసీనా విషయమున మృతి నూహించుట కూడా నాకు దుస్సహమే. ఇంక వక్రోక్తి వర్జించి స్పష్టముగా మాటలాడుడు. ఆమె జీవించియున్నదా? ఆ సౌకుమార్యము తలపునకు వచ్చునపుడు ఆమె ఇట్టి విపత్తియందు ప్రాణములు వీడెనన్నను నాకు వింతగా తోపదు.

శంభూ—మీ రట్లు తలచవద్దు. ఆమె శరీరస్థితి మును పటికన్న బాగుగా నున్నది.

మహా—మునుపటికన్న బాగుగానుండుటకు హేతువు కానరాదు, సరేకదా, అప్పటివలె నుండుటకూడా ఆశ్చర్యమే.

శంభూ—ఇంతవరకూ ఆమె దేహస్థితిని గురించి చింతిలుచున్న మీరు ఆమెసేమ మెరిగి అంతగా సంతసించిన ట్లగపడదే?

మహా—బ్రతికియుండిన ఏమి ప్రయోజనము? ఆమెకు సంతస ముండదు.

శంభూ—అయ్యా, నే నసత్య మాడను; ఆమె యిప్పు డానందమున తులతూగుచున్నది.

మహా—ఆమె శరీరస్థితియు మానసిక వ్యవస్థయు మును

పటికన్న బాగుగ నున్నవంటిరి. మీ అభిప్రాయము నాకు గోచరించ లేదు.

శంభూ——మానస మానందమయము మగుటచేతనే శరీరారోగ్య మతిశయించినది.

మహా——ఇది సత్యమని నే నెంచను. నా వియోగమున ఆమె కానందము కల్గుటెట్లు ?

శంభూ——ఆవియోగముచే ఆమెమనోరథసిద్ధికి ఘటిల్లిన విఘ్నము తొలగి యుండవచ్చును.

మహా——నా వియోగముచే ఆమెకు సఫలము కాగల మనోరథ మామె కేది ఉండగలదు ?

శంభూ——మీయందలి అనురాగ మంతరించెనేమో ?

మహా——ఇది అసంగతము, అసంభావ్యము. నా యందలి అనురాగ మంతరించుటకు నే నేమీ చేయలేను. నవ్వులకైన ఆమెతో నేనెన్నడూ కలహించ లేదు, కలలోనైన ఆమెను కసర లేదు.

శంభూ——మి మ్మిప్పుడామె లెక్కింపకుండుటకు మీ నిష్ఠురప్రవర్తనము కన్న వేరు కారణము కలదేమో ?...జయశాలియు మీకన్న నధికు డగు వీరు డెవడైన ఆమెచిత్తాకాశమున పొడచూపకూడదా ?

మహా——ఇదివరకే అట్లు జరుగకుండుటకు హేతువేమి?

శంభూ——అన్యోన్య సందర్శనము కాకపోవుట చేత కాబోలు.

మహా.—నే నాయెదృష్టిపథమునుండి తొలగినవెన్క వా డామెకంట పడెనా?

శంభూ—మీ యిద్దరికి వియోగము కలుగజేసిన వాడు ఆమె కంట పడినవాడూ ఒక్కడే ఏమో?

మహా—ఏమీ, అబాజీసోన్ దేవా?

శంభూ—ఆకోతి నేస్త్రీ మోహించును? నేనుదయము శివాజీ మహారాజుగా రిచ్చటికి వచ్చుట మీ రెరుగరా?

మహా—శివాజీ వచ్చినతోడనే హసీనా వానికంఠమున పుష్పహారము వేసినదా?

శంభూ—ఎంత ప్రేమయున్న నట్లు చేయుటకు కుల కాంత తెగించునా?

మహా—సరిసరి- ఈకులకాంత తనకాంతు నేకాంత ముగా సందర్శించుట కేవేని ఏర్పాటులు చేసియున్నదా ఏమి?

శంభూ—నేటిరాత్రి నాప్రయత్నము మూలముననే ఆమెకు మహారాజు దర్శనము ప్రాప్తించగలదు.

మహా—ఇట్టి సందర్భమున మధ్యవర్తిత్వము నానంద ముతో స్వీకరించిన నీచుడు కులకాంతల కవమానము చేకూ ర్చుటకు వారియెడ ఎట్టి యపదూరునైన సృజించుటకు వెను దీయబోడు.

శంభూ—కులకాంతల వ్యర్థముగా అపకీర్తిపాలు చేయు వా డుండునా?

మహా—నాభార్య దుష్కృత్యముల నాచెవిని వేయు

టకు మీరేల పూనితిరి;

శంభూ—ఆ కులట మోసగించిన భర్తచే దానికి తగిన శిక్ష చేయించుటకు మీ యెడల నాకుగల వైరభావము వదిలి మీకడకు వచ్చితిని. అట్టిస్త్రీ తన జనమునకే కాక మానవ కోటికే శత్రువని భావింపనగును.

మహా—ఆమె నాయెడ నింత ద్రోహము తలపెట్టు నని నేను నమ్మజాలను.

శంభూ—అట్లయిన ప్రత్యక్షప్రమాణముతో మీకు పనిలేదన్నమాటే!

మహా—ఏమీ? ప్రత్యక్షప్రమాణమా! మీరు నాకు ప్రత్యక్షముగా నేమిచూపగలరు? నా హసీనా శివాజీని ప్రేమ భిక్ష పెట్టుమని యాచించుట చూపగలరా? వానిచే ధిక్కరింప బడి వాని పాదములకు మొక్కుచున్నట్లు చూపగలరా? దైన్యభావమొందిన దాని మోమును వీక్షించి శివాజీ జాలి గొని దాని నక్కునజేర్చి ముద్దులతో నింపిన దృశ్యము చూప గలరా?......ఎందుకీ వ్యర్థప్రలాపములు?

శంభూ—ఇట్టి దృశ్యములే మీకంట బడినప్పుడు మీ కన్నులనుకూడా మీరు విశ్వసించరేమో?

మహా—ఆ హసీనా నా కంటిలోని పాప. అదే నన్ను మోసగించినప్పుడు చైతన్యములేని నా కన్నుల నే నెట్లు విశ్వ సింతును?

శంభూ—తనభార్యా దుష్ప్రవర్తనముల విశ్వసింప

జాలక తినకన్నలే విశ్వసనీయములు కావని యెంచు వెర్రి బాగులవానిని చూడ నాకు జాలిపుట్టుచున్నది. ఇట్టి అగాధ భర్తృప్రేమ నెంచియైన ఆమె మోసగించ కూడదు.

మహా—తన్నంత ప్రేమించిన భర్తను మరచి కంట పడిన క్రొత్తవానిని వలచుటకు హసీనా వేశ్య కాదే! సర్దారు గారూ! దాని దుష్టచేష్టల నా కగపరిచితిరేని నేను మీకు చెప్పినచొప్పున నడుచుకొందును.

శంభూ—అట్లయిన నామె రూపు మాపెదరా?

మహా—అబ్బా! ఎంత మాటాడితిరి! తనప్రేమనెల్ల నాయందు నిక్షిప్తముచేసి పలుసారులు నావక్షమున కీలించిన ఆమెశిరమును నేను ఛేదించవలెనా?

శంభూ—మిమ్ము అధఃకరించి అన్యుని వక్షమున నామె వాల్చిన శిరమును ఛేదించుటకు మీరు వెనుదీయనేల?

మహా—అయ్యో! ఆమెయెడ నాకెట్టి గాఢప్రేమ యున్నదో ఎవ్వరూ ఊహించలేరు. నా కోపోపశమమునకు దాని వధించుటకన్న నేనే ప్రాణహాని కావించుకొని ఆమె కోర్కె నిరాటంకముగా నెరవేరనిచ్చుటమేలని నాకు తట్టు చున్నది.

శంభూ—ఇది న్యాయము కాదు.

మహా—ఏల?

శంభూ—మెత్తనైన మీచిత్తమును వశపరచుకొన్నది కావుననే ఆమె అట్టి నిందాస్పదమైన పని చేయసాహసించి

నది-నరే, మీ రాత్మహత్య కావింతురు. దాని పరిణామ మెట్లుండునో ఇంచుక యోచించితిరా? ఆమె స్వేచ్ఛాచరణమున కాటంకము లేకపోవుట నరే, ఇక ఆమె నుదాహరణముగా గొని అన్యస్త్రీలు దురాచారప్రవర్తకు లగుదురు. నాలిముచ్చులు నలుగడల చెలరేగుదురు. ఆమె దుష్ప్రవర్తనమున మీ వంశమునకు శాశ్వతమైన మచ్చ సంక్రమించకుండ జేయుట మీకు విధికాదా? ఆమె జీవించియుండునంతవరకు మీకులమునకూ శీలమునకూ ఎంత హైన్యము ఘటిల్లునో ఇంచుక యోచింపుడు. ఆమెపై మీకుగల అవ్యాజప్రేమవృత్తమునకు విషఫలము జనించెను. కావున ఆమె నంత మొందించుడు. తద్రక్తప్రవాహమును కన్నులార గాంచి శోకాశ్రువుల మోదాశ్రువులుగా మార్చుడు. ఇంకొకటి, ఆ కులట దుండగముల ప్రత్యక్షముగా చూచునప్పుడు ఆమె నొక్కర్తెనే చంపినంతమాత్రమున పూర్ణ ఫలముండదు. దానితోకూడ దాని ప్రియుని అంత మొందించవలయును. శివాజీమహారాజు నాకు ప్రభువైయుండ మీకిట్లు బోధించుటవలన నే నెంతనిరపేక్షావర్తనమునకు గడంగుచుంటినో, కులకాంతలు దుష్టవర్తనమాచరించుట చూడ నా కెంతరోషము జనించునో మీరే ఊహించుకొనుడు. శత్రుశేషమును సమయించిన పిదప మీరు స్వతంత్రులు కావున ఆత్మహత్య యథేచ్ఛముగా నొనరింపవచ్చును. ఇట్టి సందర్భమున మూడువధలు జరుగుట సర్వసామాన్యవిషయము.

మహా—ప్రేమచూపుటకన్న కర్తవ్యనిర్వహణము యోగ్యతరము, కులకళంకినిని కూల్చుట అత్యావశ్యకము; మిండగానితో గూడ దానిని మృత్యుదేవతకు బలియిచ్చి అమితానందమున ప్రాణముల బాసెదను.

శంభూ—అది అత్యుత్తమము.

మహా—ఇంతతో మీరు స్వస్థులని యెంచనద్దు. మీరిప్పుడు నాతో చెప్పిన విషయములు నాకంటబడకున్న ఆ పాపదంపతుల హరింపనున్న ఖడ్గము మీకంఠముపై బడునని నమ్ముడు.

శంభూ—అందు కేమిగొరదవ? ఇక నాకు సెలవొసంగుడు. సాయంకాలమునకు కావలసిన పరికరములతో మీకడకు వచ్చెద. నావెంబడి వచ్చుటకు సంసిద్ధులైయుండుడు.

మహా—నే నిప్పుడే సిద్ధముగా నున్నాను.

(తెర వాలును)

శంభూ—(బయటికి వచ్చి) నేదలచిన కార్య మింతవరకూ సానుకూలముగా నెరవేరినది. ఇక శివాజీ విశ్రామాగారమును పువ్వులతో నలంకరించవలెను. ప్రక్క గదిలో వాని భార్యలను, రెండోదానిలో మహమ్మదును ఒండొరులకు తెలియకుండ కూర్చుండబెట్టు ఏర్పాటులు చేయవలెను. అట్లొనర్చితినా శివాజీహసీనాల సంభాషణ వారందరికీ వినబడును... ఆబాజీని ఈకుట్రలో చేర్చలేదు. మంత్రి మారు చెవులలో పడకూడదు. నామతమున నాల్గవచెవినైన నంట

కూడదు. "మంది చేరితే మతమునకు చేటు". ఆబాజీకి నాపన్నుగడ ఏమాత్రమైన చెవిసోకినచో ఈసరికే నన్నంత మొందించుటో లేక బందిఖానాలో పడద్రోయుటో జరిగి యుండును. అదే త్వరగా ఇటకే వచ్చుచున్నాడు.

(ఆబాజీ వచ్చును.)

ఆబా—మామగారూ, సుబేదారుకోడుకు జాడ గాని కోడలిజాడ గాని తెలిసినదా అని ఆబాసాహెబు నేడు నన్న డిగినాడు. ఈసాయంత్రములోగా వారి నాతని సముఖమున నిలుపుదునని ఒప్పుకొన్నాను. ఇటుపైని వారిని దాచియుంచు టకు వీలులేదు సుడీ.

శంభూ—నేటిరాత్రి హసీనాను శివాజీయెదుట నిలుప నున్నాము కదా, ఆమె నొకసారి చూచి మోహవాగురుల జిక్కి ఆతడామెతో ప్రసంగించెనా సర్వమూ మరచిపోవును. ఐనను దానిమగని నేటిరాత్రి ఆ మేడలోనే యుంచెదను. హసీనాప్రశంసలో బడిన శివాజీజ్ఞప్తికి మహన్మదు రాకుండు టయే మేలు, లేకున్న అతని కాయువు మూడినదన్నమాటే.

ఆబా—నేను నెరవేర్చవలసిన పనులు చాలా యున్నవి. ఊపిరితీయుటకైన తెరపిలేదు. మొన్నటి లూటీలోసంపా దించిన వస్తుచయమెల్ల ఆబాసాహెబెదుట పెట్టుకున్న, యుద్ధచతురులకు బహుమానము లీయవలెను, ఎన్ని ఏర్పా టులు చేయవలసియున్నది!

శంభూ—కొలువు ముగిసినతోడనే త్రిభువనమునన

సాటిలేని రత్న మొకటి మీకులభించినదనియూ దానిని నిండు కొల్వున జూపుట భావ్యముకాదని తలచి ఏకాంతమున జూపుటకు దాచియుంచితిననియూ తెలిపి వెంటనే ఆమెను లోని కంపుము.

ఆబా——మీ ఆలోచన బాగుగా నున్నది. అట్లే చేసెదను. (పోవుదురు)

---

——ఐదవ రంగము——

---

(గుల్ జార్ అమీనాలు)

గుల్——అమీనా, తుదకు నావహుక్కాను నేను తె చ్చుకొంటిని. శూరుల కేదైన సులభసాధ్యము సుమా.

అమీ——భుజశక్తిచేతనే పొందగల్గితిరా?

గుల్——మరేమి? పురుషులు భుజబలముచేతనే సర్వ మునూ నిర్వహింతురు.

అమీ——ఇంతపని నెరవేర్పగలిగిన ఆ కంకణము లెంత బరు వుండునో!

గుల్——(స్వ) అఆఁ! దీనికి తెలిసిన ట్లున్నదే? (ప్రకా) నీ పరియాచకము నా కర్థము కాలేదు. నేను కపటమన్న దెరుగను.

అమీ——పోటుబంట్లు దర్బారునకు గాజులు తొడుగు కొని పొల్పుదురా?

గుల్——అది నీ కెవరు చెప్పిరి?

అమీ——మిమ్ము చూచినవారే. ఊళ్ళో అంతట ఇదే ప్రస్తావము- లావుగా పొడవుగానూ ఉన్న ఒక స్త్రీ దర్బారుకు వచ్చి తనవాలుకా విప్పించుమని మహారాజుగారిని వేడుకొనగా, ఆమె కపటస్త్రీ అయియుండునని వారి కనుమానము కలిగిననూ ఆడవారియందలి ఆదరముచే రాజుగారు సందేహము బైటపెట్టలేదని ప్రతివారూ చెప్పుకొనుచున్నారు.

గుల్——చూచితివా? స్త్రీ వేష మెంతచాకచక్యముతో వేసిననూ నా పురుషత్వము శివాజీవంటి శూరుని చిత్తము నాకర్షించినది. నా పురుషత్వము నీమనము నాకర్షింప లేక పోయెగదా?

అమీ——మీయందు గొప్ప ప్రజ్ఞ యున్నది. అందుననే మీరు స్త్రీవేషము దాల్చినప్పుడు పురుషులుగానూ పురుష వేషమున నున్నప్పుడు స్త్రీగానూ కానవచ్చుచుందురు. మీమాటలలో పస ఏమీ కానరాదు; బంటువృత్తి మాని వెనకటి వృత్తినే స్వీకరించుట మేలు, అందులోనైనా మీరు రక్తస్రావము పుష్కలముగా కావించుచుందురు.

గుల్——అట్లైననా యాశలన్నీ అడుగంటవలసినదేనా? ఆ విందులూ, ఆ రకరకాలమద్యమూ, అంతఃపురమూ-

అమీ——ఏమి యంతఃపురము, ఏమి కథ-మిమ్ము స్త్రీ అని భావించి ఎవరైన వారి అంతఃపురమునకు కొనిపోకున్న నదియె చాలును.

గుల్—నాకెట్టి ఆశాభంగము కలిగిననూ నీవు దయ దలచి నాకు భార్యవైతివేని నాదుఃఖముల నెల్ల మరతును.

అమీ—నే నిట్టి స్త్రైణునకు భార్యను కాజాలను.

గుల్—నీవు గీసినగీటు దాటనని ప్రమాణము చేసె దను.

అమీ—అదేమి గొప్ప? భార్య మగనిపై తన అధి కారమును చలాయించదా?

గుల్—నీ వంతఃపురమున నుండి నన్ను బానిసెల బహిఃపురమున నుంచిననూ నేను కడుసంతోషముతో నం దుందును. నా కోర్కె తీర్పవా?

అమీ—నేను స్వతంత్రను కాను. నా యజమాను రాలి సమ్మతిని పడయవలెను.

గుల్—మీ రాణిగారు తాము స్వయముగా శివాజీ అంతఃపురమునకు పోవుట లేదా? వారు నిన్నేల ఆటంకపర చెదరు?

అమీ—తినబోవుచూ రుచి యడుగనేల? ఏమి జరుగ నున్నదో కనిపెట్టి ముందుగతి నిశ్చయించవచ్చును.

గుల్—నీ యిష్ట మెట్లో అట్లే జరుపవచ్చును.

అమీ—అమ్మగారితో మీరుకూడ పోవలయును కదా! ఆలస్యమగుచున్నది.

———

## —:ఆరవ రంగము:—

(శివాజీ ఆబాజీసోన్ దేవులు)

శివా—నేడు ఏలొకో నాచిత్తము వ్యాకులపడు చున్నది.

ఆబా—తెల్లవారినది మొదలు చాలా శ్రమకోర్చి యుంటిరి, కావున అలయుట సహజమే. అందుచేత ప్రభువు వారి మానసము కలతచెంది యున్నది.

శివా—ఇది ఒళ్ళు అలయుటచేత గాని మానసిక శ్రమచే గాని కలుగునది కాదు,అవి నాకు చిరతరాభ్యస్తములే, నేను వాటిని లెక్కసేయను.ఏదేని పాపకర్మమాచరించునపుడు చిత్తములో సంభవించు కలవరము నేడు నా కనుభవసిద్ధమైనట్లున్నది. ఏమియొ తోచకున్నది.

ఆబా—మీ ప్రవర్తనకు వ్యతిరేకమైన పని నేడేమి జరిగినది?

శివా—నేడే అననేల? ప్రతియుద్ధమున వీరులకు లజ్జాకరమైన లూటీ చేయవలసివచ్చును. ఈ సర్వసామాన్యమైన కలికాలపు రాజనీతికన్న ప్రశంసనీయమగు నీతిపథము నేర్పరుపవలెనని నేను చేయు యత్నములన్నియు నిష్ఫలములగు చున్నవి. శాత్రవుల సొత్తునైన దోచుకొనుట నాయభిమతము కాదు, ఇక నిరపరాధులగు ప్రజల ధనముమాట చెప్పనేల? వేరుపాయము తోచదాయె. ధనము లేకున్న సైన్యమును

కూర్చజాలము, పారితోషికము లిచ్చినగాని భటులు పరాక్ర మించరు; స్వరాజ్యప్రాప్తికి చాలినంతసొత్తు నా పూర్వు లార్జించి యుంచలేదు, నిధినిక్షేపములు నాకు దొరకలేదు.

ఆబా—చేతజిక్కిన ద్రవ్యమునుకూడ ప్రభువువారు వాఘసు చేయుచునే యున్నారు.

శివా—భవానీదేవి కటాక్షమున్నచో ద్రవ్యమునకు కొదవ యుండదు. అప్పుడు పరులసొమ్ము నపహరింప నవ సరముండదు.

ఆబా—మీ రించుక విశ్రాంతి చెందితిరేని చిత్త క్షోభకొంత ఉపశమించును. విశ్రామాగారమును చక్కగా నలంకరించితిమి.

శివా—ఆహా! ఈ గవాక్షమునుండి చొచ్చుచున్న మందమారుతము భవనమున కెదుటనున్న జలధారాయంత్ర ములనుండి ఎగయు నీటితుంపరలతో నిండి ఆయాసము నచిర కాలమున అంతరించుచున్నది. ఇందలి పటములు నవరస దృశ్యములచే కనువిం దొనర్చుచూ భారతభూమి ప్రాచీనేతి హాసము కన్నులకు గట్టుచున్నవి. క్షణభంగురములగు రూపా కారములకు చిరస్థాయిత్వ మాపాదించి భగవత్సృష్టికన్న మానవసృష్టియే మేలని తోపించు ఈ చిత్రలేఖనము లోక మున కెంత యుపకార మొనర్చుచున్నది! దేశకాలావచ్ఛిన్న ములగు వస్తువుల కాకట్టడుల మాన్పించె గదా? ఇందలి వస్తువులన్నియు ఉత్కృష్టము లగుటచే ఈగది రత్నభాండార

మన నొప్పును.

ఆబా—మహాప్రభూ! అనర్ఘమగు రత్నమొకటి నేటి లూటీలో నాకు దొరికినది, త్రిభువనముల దానికి సాటి లేదన వచ్చును. దానిని దర్బారులో అందరిమొదుట చూపుట భావ్యము కాదని ఏకాంతమున ప్రభువువారి కర్పించుటకు నిశ్చయించితిని. అది తనుశ్రమ సంతతటిని అపనయింపగలదు.

శివా—ఈ దాపరికమూ రహస్యసందర్శనములన్న నాకు గిట్టదని మీ రెరుగరా? అదీకాక నా మావళాలు చూడదగని రత్నము నావద్ద నుండదగునా? వీరమాతల గర్భముల యందు జనించిన శూరరత్నములతో పరిచయమొనర్చుకొనుటకు రాళ్ళగనినుండి వెలువడిన మీ రత్నమున కర్హతయుండదని నా అభిప్రాయము.

ఆబా—మహాప్రభూ! ఈ యపరాధమును మన్నింప వేడెదను, ఇంకమీద నిట్టి పొరపాటు జరుగనీయను.

శివా—సరే, దాని గొనిరండు. (ఆబాజీ పోవును) ఎంత విలువగల రత్నమైనా నేను దానిని ధరించక అమ్మి స్వరాజ్యప్రాప్తికి తగిన పరికరముల సేకరింతును. (హాసీనా వచ్చును) ఏమిది? ఈ అపురూప యవనవనిత ఎవతె? పుష్పాలంకారము చేతను వింతవాసనలగుప్పు అంబరములచేతనూ పరివృతమై ఇలగల వనితల మీరిన యింపుసొంపు గొల్పు వినయమర్యాదాది భూషణములతో తలవంచి నిలిచి

నది! సాధ్వీమణీ, ఇన్ని చౌకీపారాల దాటి నీ విచ్చటికి కెట్లు రాగల్గితివి ?

హా—మహారాజా, సన్నెవ్వరూ ఆటంకబెట్టలేదు; పౌరాజవానులు నన్నుచూచి నివ్వెరపడిరి.

శివా—ఇం దాశ్చర్యమేమి? ఆరోగ్యము, తారుణ్యము, సౌందర్యములతో నిండిన సీయందు నిర్మలత్వము, నిష్కాపట్యము, సౌజన్యము ప్రతిఫలించుచున్నవి. ఇవి ఎట్టివారి నైన తబ్బిబ్బు చేయగలవు.

హాసీ—(స్వ) ఈతడా శివాజీ! ఈతనిగూర్చి నేను విన్నదానిబట్టి అతి భయంకర రూపుడని భావించియుంటిని. ముఖము నందౌదార్యము దయయూ, తాండవమాడుచున్నవి... కాని బాహ్యస్వరూప మంతరంగ ప్రవృత్తికి విపరీతముగా నుండవచ్చును, ఇందుకు నేనే తార్కాణము. సౌశీల్య మంతయు కేవలాభినయమని యెంచి భర్తృఘాతకుడగు వీనిపై పగ దీర్చుకొనవలయును.

శివా—యువతీనతంనమా, నీవు తోవ తప్పినావు; నీ కెవరితో పని గలదు ?

హాసీ—ప్రభువువారితోనే.

శివా—అటులనా ? ఏమి పని ?

హాసీ—మీ రాజ్యమున ఉన్నతపదవియందున్న నొక వ్యక్తిపై నేను ఫిర్యాదు చేయవలసియున్నది.

శివా—ఆ యధికారి దుండగ మెట్టిది?

హాసీ—ఆతడు దొంగిలించినాడు.

శివా—అట్లైన నేడు దర్బారునకు నీ వేల రాలేదు? స్త్రీలనుండి అపహరించిన వస్తువులను వాపసు చేయుదుమని నీవు వినలేదా... పోనీ ... ఇప్పుడైనా మించిపోలేదు. నీ వస్తు వేది దొంగిలింపబడినదో చెప్పితివేని వెంటనే యిప్పించెదను.

హాసీ—అది దొరుకునది కాదు.

శివా—నీ కా చింత వలదు-దాని హరించినవా డెట్టి అధికారియైననూ సరే, వానిచేత నీ వస్తువు నీ కిప్పించెదను.

హాసీ—దానికి రూపరసగంధములు లేవు; కావున తెచ్చిచ్చుటకు వీలులేదు.

శివా—నీకు మానభంగ మొనర్చెనా? చెప్పు మా ఖలు డెవడో.

హాసీ—లేదు, లేదు-ఆవస్తువు హరింపబడినదని నాకు చింతలేదు; తన్మూలమున సుఖమే కలుగుచున్నది.

శివా—వింతగా నున్నది! వస్తువు పోయెనని చింత లేదా? అట్లైన ఫిర్యాదుచేయుట కవకాశ మేది? నీ కిప్పుడేమి కావలయును?

హాసీ—అతడు దొంగిలించిన వస్తువువంటి దాతని వస్తువు నాకు లభించునట్లు చేయగోరెదను. ఆతడుహరించిననావస్తువు నాకు లభించుట అసంభవము కావున దానిసాటి వస్తువును చూచుకొనినయెడ నూరట చెందెదను.

శివా—నీ మాటలు నా కర్థముకాలేదు-నీ వేదో ప్రణయమునకు సంబంధించిన ప్రస్తావము చెప్పునట్లున్నది.

శివా—ప్రణయరాజ్యమున చోరుడే న్యాయాధికారి కావున, నీ ప్రేమను హరించినవారికడ ఫిర్యాదుచేయుము, వారే తగు విచారణచేసి నీకు రావలసిన దాని నిప్పించెదరు.

హాసీ—మీ యానతిలేక అతడు నన్ను ప్రేమించుటకు సాహసింపడు.

శివా—బాగుబాగు! అతడు నిన్ను ప్రేమించుటకు నాజోలి యేల?

హాసీ—అతడు హిందువు, నేను మహమ్మదీయ వనితను, మా పరస్పరప్రేమ మీకు సమ్మతము కాకపోవచ్చును.

శివా—మీ పరస్పరానురాగము మీ చిత్తవృత్తుల ననుసరించి యుండును. రాష్ట్రహితమునకు ప్రతికూలము కానిచో వ్యక్తిస్వాతంత్ర్యమునకు నే నడ్డురాను.

హాసీ—అతని కిప్పటికే ఇద్దరు భార్యలు కలరు!

శివా—అట్లైన అతని యిష్టము, అతని భార్యల యిష్టము; దేశశాసనము నతిక్రమింపకుండిన అందు నాప్రమేయమే లేదు.

హాసీ—ఈమాట నాకు సంతసము కూర్చుచున్నది.

శివా—ఇంతకు మిక్కిలి నన్నడుగదలచినది లేకున్న కాలయాపన మొనర్పక నీదారిని నీవరుగ వచ్చును.

హసీ—నాప్రియు డీమేడలో నుండుటచే నే నిటనుండి కదలలేను.

శివా—హోసీ-ఆతని నీచెంతకు రమ్మందునా?

హసీ—మన ఏకాంతవాసమున మూడవవానితో నేమి పని? మహారాజా! మీరు యుద్ధములయందును రాజ్య పరిపాలనమునందునూ అతిచతురులని పేరువడసిన ప్రభువులు కదా, పరాక్రమాతిరేకమున పరులరాజ్యముల స్వాధీనపరచు కొనినట్లే ప్రతాపముచూపి లలనామనోరాజ్యములపై దాడి వెడలరేల?...ఆఁ ఇది యొకవింత కాదు-మీకు ప్రణయవిద్య నేర్పదగిన స్త్రీ ఇంతవరకూ దిక్కు లేదు, ఆ యుద్యోగము నాకు ప్రసాదించెదరా?

శివా—ఇది నన్ను కోరదగిన కోర్కె కాదు.

హసీ—మహాప్రభూ! మీ శౌర్యమును గూర్చియూ యుద్ధచాతుర్యమును గూర్చియూ వినియుంటిని-కాని మీ రెంతశూరులో అంతసౌందర్యవంతులని యిప్పుడు నాకు తెలిసినది.

శివా—సౌందర్యమా!...లంకలో హరిశ్చంద్రమువలె మహారాష్ట్రమున సౌందర్యము పూజ్యము, మీ ఆగ్రాయందలి భవ్యప్రాసాదముల యెదుట మా పునామేడ లెట్లుండునో మీ అందము ముందర మా చంద మట్లుండును. మీ శరీరములు తాజ్‌మహల్ వలె నిగనిగలాడుచుండ, మా శరీరములు సహ్యాద్రిశిఖరమువలె మోటుగా నుండును. అదీకాక శరీర

సౌష్టవము కై మీవారివలె మేము పూనికతో పాటుపడము. ప్రకృతియు లలితకళలునగా మీవారికిపోలె మాకుతోడ్పడవు-మాకు సౌందర్య మబ్బుటెట్లు? అది సుఖమునబుట్టి సుఖము ననే పెరుగును. ఆజన్మమూ సౌఖ్యమెరుగని మాకు సౌందర్య మెట్లొదవును?

హాసీ—మీయందు వాస్తవముగా సౌందర్యము కలదో, లేక మిమ్ముచూచి నేనట్లు భ్రమపడుచుంటినో చెప్పజాలను- స్త్రీ చిత్తము స్త్రీలకుకూడ దురవగాహము-ఏది యెట్లున్నను నాప్రేమ మీయందు లగ్నమైనదని చెప్పుట కాక్షేపము లేదు.

శివా—సౌందర్యమువలెనే ప్రేమయు సుఖముపై నాధారపడి యుండును. మీవారెన్ని శతాబ్దములనుండియో సుఖమున నోలలాడుచుండుటచే మీకు ప్రేమవ్యవహారములు మెండు, ప్రేమరాజ్యమున మీరెప్పుడును వర్తింతురు. మానాళ్ళసుఖమును చూచుకొని ప్రేమప్రసంగములలో తల దూర్చెదరు? మాకు స్వాతంత్ర్యము సున్నయగుటచే నిజమైన సుఖమూ పూజ్యమే. పారతంత్ర్యపిగిళముచే మా కాలు చేతులు బంధింపబడినవి. స్వేచ్ఛగా నొకఅడుగు వేయజాలము. బెల్లమును చీమలవలె మాయిండ్లను తురకచారులు ముట్టడించి యుందురు. మేము చేయు పనులూ మే మనుకొన్నమాట లూ తక్షణమే పాదుషావారి చెవి కెక్కును. వారెప్పుడు పైని పడుదురో అను భయముచే మాగుండెలు తటతటలాడుచునే

యుంచును. ఆప్తులతో మాటలాడునపుడునూ అదే జంకు. మా నోళ్ళు, కాలుసేతులూ పారతంత్ర్యమున బంధింపబడి యున్నప్పుడు మాభావములకు మాత్రము స్వాతంత్ర్య ముం డునా? ఈ దేశమునకు మేము స్వాములమన్న మాటే మరచి నాము. ముందెప్పుడైన నది మాకు స్వాధీనమగునను ఆశ కూడా లేదు. అలవాటుచేత స్వాతంత్ర్యవాసనకూడ మాకు గిట్టకున్నది. తురకల అడుగులకు మడుగు లొత్తుచుండుటయే మాకు సర్వస్వ మనిపించుచున్నది. పారతంత్ర్యవిషముచే నార్ద్రమగు భారతభూమిని స్వేచ్ఛాబీజములు మొలక లెత్త నేర్చునా?... ప్రేమకు కూడా స్వాతంత్ర్య మున్నది-పెద్దల మాటల నది సరకుచేయదు, లోకాపవాదకు లొంగదు, రాజాజ్ఞనూ ధర్మమునూ అణగదొక్కును, జాతిమతభేదము లకు గాని శత్రుత్వమిత్రత్వములకు గాని తావుంచక దేశమ ర్యాద నవలీల నతిక్రమించును. అగాధములైన మహాసముద్ర ములు కాని, ఆకసమునంటు పర్వతపంక్తులు గాని దానిగతి నిరోధింపజాలవు, ప్రేమ ఇతరులనూ తనవారినీ వేరుగా జూడనీయక సమత నాశయున ట్లొనరించుచుండును. ఇట్టి స్వేచ్ఛావిహారము పారతంత్ర్యపల్వలమున బడియున్న మాకె ట్లు లలవడును?

హాసీ——మహారాజా, అట్టి పారతంత్ర్యమునకు మీరు బహిర్భూతులు కావున ఈవర్ణన మీయందు వర్తింపదు.

శివా——స్వాతంత్ర్యభేరీనాదము పారతంత్ర్యసుషుప్తి

యందు గాఢముగా నిద్రించిన మామహారాష్ట్రదేవత చెవుల సోకునప్పుడెల్ల బీజపూరు, గోల్కొండ, ఢిల్లీసింగము లా ధ్వనికడిరిపడి మాయత్నముల నిరోధించుచున్నవి. వారి యాటలు సాగకుండ మాభటులకు స్వాతంత్ర్యాసక్తియను అభేద్యకవచమును తొడగవలసియున్నది. అప్పుడు మాహృదయములందు అజయ్యమైన ఆత్మవిశ్వాస ముద్భవించును. ఇది ఒకటి రెండు వత్సరములలో నిర్వహింపబడు కార్యముగాదు. తలకు మీరినపని దాపునుండ తన్ప్రేమరాజ్యముపై దాడి వెడలుటకు నా కవకాశ మేది?

హాసీ——స్వాతంత్ర్యనిర్వహణమునకై పోరుచూ మీరు శ్రాంతులైన తరి మిమ్ము సేదదీర్చుటకు నాబోటి సహధర్మిణి యుండినచో మీయుత్సాహము రెట్టింపదా?

శివా——అందుకు తగిన యేర్పాటులు నాతల్లిదండ్రు లిదివరకే ఒనర్చినారు. నా పెద్దభార్య చతురసంభాషణము తోడనూ నాచిన్నభార్య తనసౌందర్య విభ్రమములతోడనూ నా యుల్లమును రంజిల్లజేయుటకు తగిన సామర్థ్యమును కలిగి యున్నారు.

హాసీ——శివాజీమహారా జెంతప్రతాపవంతుడో అంత రసికుడని నేను తలచుచుంటిని, కాని, అదిభ్రాంతి యనియు భువనమోహినినని అహమిక కల్గిన నా సౌందర్య మాతని యెడ నిష్ఫలమనియూ ఇప్పుడు స్పష్టమైనది.

శివా——నీ సౌందర్య మద్వితీయము కాదని ఎవ రన

గలరు? చైతన్యము గలవారినెల్ల అది జడులను చేయగలదు. పాషాణమువంటి జడపదార్థమునకైన చలనము కలిగించును. ఇక సర్వసామాన్యుడను నే నొకలెక్కా!

హాసీ—వట్టిమాటలవలన ప్రయోజనమేమి? నాదురవస్థ చూచి మీచిత్త మించుకేని కరుగదుగదా! ఆర్తనై వేడుచుంటిని-మీ యందలి యనురాగము మిక్కుటమై నా తనువు పారవశ్యతనొందినది, కళ్ళలన్నియు సడలినవి, అసంఖ్యలగు ప్రజల బ్రోచిన మీ ప్రతాపమునకు అబలనగు నన్ను బ్రోచుట బరువయ్యెనా? అయ్యో!

శివా—బాగుబాగు. ఆర్తత్రాణమున అన్యస్త్రీల నపేక్షించుట— ప్రజల బ్రోచుట యన పరకాంతల నపహరించుట— చక్కని ధర్మసూత్ర వ్యాఖ్యానమే! నీ సౌందర్యమునకు మెచ్చుకొంటిని. కాని కోరరాని నీకోర్కెను కొనసాగింప జాలను.

హాసీ—నా రూపము మీకు నచ్చుటలేదా? నా మత మడ్డువచ్చెనా?

శివా—రూపమా! మొదటనే చెప్పితినే భువనమోహనమని.

హాసీ—సరికదా, దాని చూచుటవలన మీ మానసమున నెట్టికోర్కెయూ జనింపలేదా?

శివా—మాతల్లి జిజాబాయి నీబోటి లావణ్యవతియైనచో గాని, నీయుదరమున పుట్టియుండిన గాని నేను

కూడా సుందరుడన్నై యుందునుకదా అనుకొని కోర్కె జనించినది. కాని అవి అసంభవములని యెరిగితిని.

హాసీ—(చేతనున్న కటారి పారవైచి) మహారాజా! మోసమాయె. నా ఆశలన్నిటిని ఒక్కమాటతో భంగము నర్చితిరి!

శివా—అదేమి? నీ వేమాశించితివి?

హాసీ—ఈకటారితో మిమ్ము జంపదలచితిని, కాని మీమాటలు వినినతోడనే మనస్సు మారెను.

శివా—ఇందు మోసమేది? ఊరక నన్ను చంపవలెనను పాపపుటూహ జనించి తనంతటతానే నశించినది... సరేకాని, నన్ను చంపునంత ఆగ్రహము నీకేల జనించినది?

హాసీ—నాభర్తను చంపినది చాలక నాకు కోపమేల జనించెనని అడుగుచుంటిరిగా?

శివా—నీభర్త యెవరు?

హాసీ—కళ్యాణప్రాంతపు సుబేదారు కుమారుడు మహమ్మదు.

శివా—అటులనా! నేను నీభర్తను చంపితినని పగ సాధింప నెంచితివా? సరే-కాని నీపతిని నేను చంపినట్లు నాకు జ్ఞప్తియే లేదు.

హాసీ—అడుగడుగున అనేక దుష్కృత్యము లొనర్చువారికందొకటి జ్ఞప్తియం దుండునా? గతమున కేమి? నేడు నాకుమానభంగ మొనర్ప నసుకట్టలేదా?

శివా——బేలా, నీ అనుమానమును నిన్న పిమ్మట నాకు వింత పొడముచున్నది. నే నట్టి ప్రవృత్తి కలవాడ నైనచో, ఈ తరుణమును వ్యర్థముగా పోనిత్తునా?

హాసీ——ఇది యొక టక్కు. నా మనోభావము నెరిగి పిమ్మట నన్నెటులేని వలలో వేసుకొన నిశ్చయించుకొని యుందురు.

శివా——నాచిత్తవృత్తి నాకంటె నీకు చక్కగా తెలిసి నట్లు మాటలాడుచున్నావు! పోని నీలోపమును నేను తీర్చినచో నీకోపము పోవునా?

హాసీ——నా లోపము తీరు టెట్లు? నాప్రియుని చిర వియోగమున నాకు కలిగిన దుఃఖము ద్రవ్యాదులచే అపనయింప వచ్చునని వ్యవహారజ్ఞులైన రాజనీతిజ్ఞులు తలంతు రేమో కాని ఆమర్మగ్రహణము మానకయుండుటయే నిసర్గప్రేయసులకు సంతసము గూర్చును.

శివా——నీ భర్తను నేనపహరించితినంటివి కావున అతనికి మారుగా వేరొకపతిని నీకు కూర్చుట నాకు కర్తవ్యము.

హాసీ——నీచవాసనల నెంతయణగద్రొక్కినను అవి పైకి రాకమానవు. పుట్టిననాటి బుద్ధి పుడకతో గాని పోదు... సరే-ఆభర్త యెవరో ఇంచుక సెలవిచ్చెదరా?

శివా——నీభర్త కీడగు సుందరుని కూర్చినచో నీ కభ్యంతర ముండదు కదా?

హసీ—దాంపత్యమన్న బజారు బేరమా? అది వర్తకులకు చెల్లునుకాని ప్రేయసులకు సరిపడదు.

శివా—సర్వవిషయములనూ నీపతి కీడుదీయని పురుషుడు నీయెదుట నిల్చిన వాని నుపేక్షింతువా?

హసీ—(స్వ) ఈత డెట్టి కపటరచన కావింపనున్నాడో?

శివా—మౌనమర్ధాంగీకారము, ఆబాజీ, (అతడు వచ్చును) ఆ వ్యక్తి సిద్ధముగా నున్నాడా?

ఆబా—మహాప్రభూ, శంభూజీగా రాతని నిదివరకే సిద్ధపరిచి యుంచినారు.

శివా—ఆతని గొనిరమ్మని మామగారితో చెప్పుము-(అతడు పోవును) సాధ్వీ, నీపతి మృతిచెందెనని నీకు దృఢమైన నమ్మకమున్నదా?

హసీ—ఆహా! మీచేత జిక్కినవారికి మృతి తప్పునా? ఇక వారిదర్శనము మీజన్మమున నాకు కలుగదు.

శివా—నీవు సాధ్వివని ప్రతీతి కలదు. తదన్యుల వరించ వన్నమాటే.

(ఆబాజీ, శంభూజీ, మహమ్మదును వత్తురు)

హసీ—(మహమ్మదును కౌగిలించి) ప్రాణేశా, ఇన్నినాళ్ళెచటనుంటిరి? మీ రీలోకమును వీడిరని విని నేనెంత తహతహబడితినో మీ రెరుగుదురా? ఇంతదనుక నన్ను బాసి యుండి నే డీవిషమపరీక్షలో నెట్లు కడతేరుదునో చూడ వచ్చితిరా? ఇది మీకు భావ్యమా?

శివా—తరుణీమణీ - వ్రతభంగము నర్చుచుంటివి- ఇప్పుడైన మెలకువ తెచ్చుకొనుము. పరపురుషు సంటుట పతివ్రతకు భావ్యమా?

మహా—ప్రేయసీ! మనము స్వార్థపరాయణులమై మర్యాద మీరుచుంటిమి. ముందీ మహాత్ముని పాదములపై బడుదము రమ్ము. వీరి యౌదార్యము మూలముననే మన మొండొరుల చూచుకొన గల్గితిమి. నీవు వారినన్న కఠినోక్తు లు నాచెవిని పడినప్పుడు నాకు పట్టరాని కోపము వచ్చెను. వారికిగల అసామాన్యస్త్రీదాక్షిణ్యముచే వారు దానిని సరకు చేయరైరి. (మొక్కుదురు.)

హాసీ—నాథా, వారు నిన్ను హత్యచేసిరని పొరపాటు పడి వారిని నేడు చంప నుద్యమించి, శీలసంపగ గాంచి విరమించితిని.

మహా—ప్రేయసీ, నీ వీమహారాజును మోహించి ప్రేమభిక్ష యాచించుటకిట వచ్చితివని విని మిమ్మిద్దరిని చంపి నే నాత్మహత్య చేసుకొనుటకు నిశ్చయించితిని.

శివా—ఈ అసత్యకల్పనచేసి హత్యావ్యూహమును పన్నిన దెవరు?

మహా-హాసీ—(శంభూజీని చూపి) ఈ మహాత్ముడు.

(సఈ సోయరాబాయిలు వత్తురు)

సఈ—మీరు లేనినేరములను మోపి మాచిత్తము లకు కలతగూర్చిన వాడూ ఇతడే.

శివా——(భార్యలతో) మీరుకూడ ఈకుట్రలో చేరిన వారేనా? ఏమి మామగారూ సుప్రాంతమును మీస్వాధీన మున నుంచనందుకు నాపై పగబట్టి మీరొనర్చిన తంత్రమా ఇది?

ఆబా——ఆబాసాహెబ్, వీరి మానసములను కలత పెట్టుటలో నాకెట్టి సంబంధము లేకున్నను, నేను నిర్దోషిని కాను. హసీనాబీబీని తమకర్పించి కొన్ని దురాగతముల నల్పుటకు తమసమ్మతిని బడయదలచి ఈవ్యూహమును పన్నుటకునే నొడంబడితిని.

శివా——ఈ దుష్టరచనకు సూత్రధారి మామగారే. ఆబాజీ-మీ నేరమును ఒప్పుకొన్నందుకు సంతసించితిని. స్వరాజ్యస్థాపన మొనరింపవలెనన్న మనవారూ పరులునూ సంతసింపవలయును. మామగారూ, మీరు పన్నిన కుతంత్రము సఫలమైనచో నే నిదివరకే ప్రాణములు బాసియుందును. మీప్రాణములను నేను హరించినచో నన్నెవ్వరూ నిందింపరు. మీరు స్వార్థపరాయణులై రక్తసంబంధమేని లెక్కచేయరైరి. న్యాయపరిశీలన చేయవలసివచ్చును కావున నేనుకూడ దాని నక్కరచేయను. మీరు స్వామికిని, వాని భార్యలకూ, నిసర్గ ప్రేమికులగు ఉత్తమదంపతులకునూ ఒకమూహూర్తమున ద్రోహమొనర్చినందుకు శిరోహరణముగ మీప్రాణములహరించినను అశిక్షతక్కువే యగును. నేను మీ కవమాన మొనర్చితినను మిషచే నీదుస్తంత్రము పన్నితిరి కావున మీ

యపరాధము సహజమాట క్షమించి, మీరు విశ్వాసపాత్రు లు కానందున మిమ్ము నా దేశమునుండి నిర్వాసితుని జేసి తిని. (గుల్ జారు అమీనాలు వత్తురు.)

గుల్—మహమ్మదుగారూ, వారే మీబీబీగారు, ఈ గడియవరకు వారిని కాపాడి తిరుగ మీ కప్పగించితిని, నేను నిర్వహించిన ఈ ఘనకార్యమునకై అమీనాను నా కొసంగుడు.

హసీ—పారితోషికము నొందుటకు నీవు పడిన పాటేమి?

గుల్—ఆనాడు మీచేతిలోని క్రైజారు తీసుకొనలేదా? అది మీయొద్దనున్న ఏమి అపాయము తటస్థించియుండునో ఇంచుక యోచింపుడు.

మహ—సరే-మాకు తలపని తలంపుగా పునర్దర్శనము లభించె. కావున నీకు బహుమతి ఇవ్వతగినదే. అమీనా కంగీకారమున్నచో మా యాటంకము లేదు.

(అహమ్మదు వచ్చును.)

అహ—అమ్మయ్యా, ఇప్పటికి నాకన్నులు చల్లనాయె. నాకొడుకూ కోడలూ జీవించియున్నారు.

శివా—ఇదే వీరిని మీ కప్పగించుచున్నాను. అన్న మాట నిలుపబెట్టుకొన్నందుకు సంతసమాయెను.

అహ—మహారాజా, మీరు ధన్యులు. మీరు కుటిల హృదయులనియు, ద్రోహులనియు వినియుంటిని, కాని అవి

కిట్టనివారి పలుకులని నేడు మా కనుభవసిద్ధమయ్యెను. ఇంత సత్యాచరణము, సౌజన్యము, పరోపకారబుద్ధి, ఇంద్రియనిగ్రహము, క్షమ, దూరదృష్టిగల మీరు మీ సచ్ఛీలసంపద చేతను విశ్వసనీయులగు మీభటుల పరాక్రమముచేతనూ మహారాష్ట్రమును మీప్రభుత్వమునకు లోబర్చుకొని కాలక్రమమున స్వరాజ్యస్థాపన మొనర్తురు. అప్పుడు ఛత్రపతులను మీబిరుదు సార్థకమగును.

ఆగా—వృద్ధుల యాశీర్వచన మమోఘము—

శుభాస్తు. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

స మా ప్త ము.



*